# వెంకన్న కోట్లు

బొమ్మలకథ: బాపు

18





















(ఇంకా ఉంది)

# ప్రతివారికి రక్షణ కావాలి






ఈ రక్షణ బాక్టీరియానుండి. చెమట వాసననుండి—మీరు, ఇతరులు సంకోచపడే అవస్థనుండి- జి-11 కూడిన సింథాల్ టాయిలెట్ పౌడరు మీకీ రక్షణలన్నీ ఇస్తుంది. ఇవేకాదు—సువాసన... సుమసుగంధము

## సింథాల్ —

దుర్గంధముల నుండి సంపూర్ణ రక్షణనిచ్చు టాయిలెట్ పౌడరు

Interpub-GSP-6/72 Tel

# ఉత్తరాలు

## ముఖచిత్రం

ఈ వారం (1—9—72) పత్రిక ముఖచిత్రం నూతన వధూవరులు శోభన్, శారదలతో సర్వాంగ సుందరంగా ఉంది. కానీ ఏ సినిమాలోదో కూడా వ్రాస్తే బాగుండేది. మీరు అనవసరమైనవి వ్రాసి, ఇటువంటివి వ్రాయటం లేదు. ముఖచిత్రం వాణిశ్రీ, అనో, లేక నాగేశ్వరరావు అనో ఇత్యాదివి వ్రాయడం అనవసరం. ఎందుకంటే వారు ఈనాడు ఏ వేషంలో ఉన్నా ఇట్టే కనిపెట్టెయ్యగలవారు అనేక మందున్నారు.

ఉపద్రష్ట కేశవస్వామి, (అమలాపురం)

## సీరియల్

'విద్యార్థి' సీరియల్ మొదటి మూడు భాగాలు చాలా బాగనిపించాయి. కాని, నాలుగో భాగంమాత్రం ఎందుకో ఎబ్బెట్టుగా తోచింది. విద్యార్థికి సుందరి పరిచయం అవడంతోటే శరీరాలు సైతం ఇచ్చి పుచ్చుకోవడం వరకు వెళ్ళింది వ్యవహారం. కొన్ని సంఘటనలు రచయిత్రి యాదృచ్ఛికంగా సృష్టించినవి తప్ప అందులో సహజత్వం లేదేమో ననిపిస్తుంది. ఉదాహరణకి చూడండి. నలుగురూ కల్సి 'ఆనంద్ మోహిని, విద్యార్థి, సుందరి సినిమాకు వెళ్తారు. రిక్షా తీసుకునేప్పుడు ఇద్దరాడవారు ఒకరిక్షాలో ఇద్దరు మగవారు వేరొక రిక్షాలో కూర్చోరాదా? సినిమా హాలులో సీట్లు సైతం ఆవిధంగ సవరించుకో రాదా? కొందరు కల్సి వెళ్ళినప్పుడు ఎవరెక్కడ కూర్చున్నా సినిమా అయిపోయిం తర్వాత అందరూ కల్సి వెళ్ళాలని ప్రయత్నిస్తారు కాని, ఎవరిదారిన వారు వెళ్తారా? ఈ సంఘటనలు కేవలం వారిద్దరిని కలపాలన్న ఉద్దేశ్యంతో సృష్టించినవి తప్ప, వాటిలో సహజత్వం ఎంతమాత్రమూ లేదు.

మేమూ కాలేజీల్లో చదివాం. స్త్రీ పురుష సహజమైన పరస్పరాకర్షణ విద్యార్థుల మధ్య ఉండేదేమోకాని, కొన్ని గంటల్లోనే శరీరాలను దగ్గరకు చేర్చుకునే అవకాశం వస్తుందంటే, అది కథల్లోనే కాని నిజజీవితంలో అంతసులభసాధ్యం కాదేమో నని నా అభిప్రాయం.

—ఎం. రవీంద్రనాద్, (మీర్జాపూర్)

*

సీరియల్ 'ఆ కా శ దీ పా లు' బిగినింగ్ ఇంట్రెష్టింగుగానే ఉంది. కానీ, 22 వ పేజీ (పత్రిక) మూడవ కాలములో ఆ గ ది లో ఉండేది కచ్చితంగా పదిమంది.. .శారద, జానకి..... అని పేర్లు వ్రాశారు. కానీ తొమ్మిదిమంది మాత్రమే ఉన్నారు. బహుశ రచయితగారు పొరపాటున ఒకరిని మర్చిపోయి ఉంటారనుకొంటాను.

కె. నిర్మలాదేవి, (మచిలీపట్నం)

## వ్యాసాలు

బి. ఎ. కె. నాగభూషణరావు వ్రాసిన వ్యాసం 'విద్యార్థులు' ఉపాధ్యాయులు' ప్రస్తుతం జరుగుచున్న వాస్తవికవిషయాలు కళ్ళకు కట్టినట్లుగా చక్కగా వివరించారని, అది మా కుటుంబం వారందరికి నచ్చినదని వ్రాయుటకు చాలా సంతోషిస్తున్నాము.

మాపెట్టి ప్రేమ్‌కుమార్, ప్రేమాబాయి, (కొండమడుగు)

* * *

1—9—72 పత్రికలో శ్రీ బి. ఎ. కే. నాగభూషణరావు గారు వ్రాసిన వ్యాసము అక్షరాల నిజము. ట్యూషన్ చదువుతున్నవారికి ఎక్కువ మార్కులు వెయ్యడమే కాదు. చదవని వారికి ఫేల్ మార్కులు ఇచ్చిన రోజులు వున్నాయి.

నేను చదువుకొనే రోజుల్లో (1960) ఇండియా మ్యాప్ వేసుకొని క్లాస్‌కు తీసుకొనిపోతే పదికి నాలుగు మార్కులు ఇచ్చారు. అదే డ్రాయింగ్ (ట్యూషన్ చదివే అబ్బాయి) ఇంకొకరు తీసుకొనివెళ్తే 7 మార్కులు ఇచ్చారంటె నమ్మండి. ఒకరోజు రెండు డ్రాయింగులు ఒకే సైజు, ఒకే కలర్ ఒకేలాగ వేసుకొని తీసుకొని వెళ్తే నాకు 5 మార్కులు. వాడికి 7 మార్కులు ఇచ్చాడు (రెండు నేను వేసినవి.)

అయినా ఏమనాలం చెప్పండి!

—నూర్ అహ్మద్ అలీ (మల్కాజిగిరి)

## సినిమా

బడిపంతులు చిత్రం గురించి ఒక పేరాలో వివరించిన కొంచెం వివరణ చాల బాగుంది. 'మట్టి బొమ్మలను బంగారు మనుషులుగా మలచిన మహాశిల్పి గాథయే ఈ బడిపంతుల కథ' అన్న మాటలు నాకెంతో నచ్చాయి. నాయకులమైనా, మహామంత్రులమైనా అక్షరభిక్ష పెట్టిన బడి పంతులును మరువరాదు. నిజంగా నేడు బాలురను భావి పౌరులుగా తీర్చి దిద్ది(ద) లేక పోయినా సామాన్య మనిషిలా మార్చడానికి ప్రయత్నం చేస్తున్న బడిపంతుళ్ళకు ప్రభుత్వం ద్వారా ఎలాంటి ప్రోత్సాహబలం, విద్యార్థులనుండి ఎలాంటి ఆప్యాయత ఆదరణలు లభిస్తున్నవో ఈ చిత్రం ద్వారా ప్రజలకు వివరంగా తెలుస్తుందని విశ్వసిస్తున్నాను.

—గోందేశి సోలాపురి రెడ్డి, (కొత్తగూడెంకాలరి)

* * *

ఆంధ్రప్రదేశంలో నేడు వివిధ భాషా చిత్రాలు విడుదల అవుతున్నాయి. వాటిలో చాలా చిత్రాలు బాక్సాఫీసు దగ్గర ఫెయిల్యూర్ అవుతున్నాయి. ఇది ఎవరికి క్షేమం కాదు. ఈ చిత్రాల జోరువలన ముఖ్యంగా నష్టపోయేది నిర్మాతలే. ఈ చిత్రాల విడుదల జోరు గురించి నిర్మాతలు, పంపిణీదారులు ఆలోచిస్తున్నాము అని చెప్పుతున్నారు. కాని వారు ఏమి పట్టించుకోనట్టుంది ప్రతి నెలా కనీసం ఎనిమిది తెలుగు చిత్రాల విడుదల అవుతున్నాయి. వీటిమధ్య డబ్బింగ్, హిందీ, ఇంగ్లీషు చిత్రాలు విడుదల అవుతున్నాయి. ఇలా చిత్రాలు ప్రేక్షకులమీద గొర్రెల మందలాగ వదులుతుంటే ముఖ్యంగా తెలుగు నిర్మాతల గతి ఏమిటి? ఈ చిత్రాల విడుదల జోరువలన మంచి కుటుంబ

# బ్రిటానియా గ్లాక్సో® బిస్కట్లు ఎంతో మంచివి పుష్టిగా పెరగడానికి

అమూల్యమైన గోధుమ, పంచదార, వెన్న, పాలు గ్లాక్సోనుండి ఆరోగ్యదాయకమైన పౌష్టిక పదార్థాలతో ఈవి బిస్కట్లు తయారుచేసాము.

తరువాత వీటిసంగతేమిటని ఎంతమందినో పాపలను అడిగాము. చిన్నపాపలు, పెద్దపాపలు అంతకంటె పెద్దవాళ్లూ ప్రేమించారు.

వాస్తవానికి అన్ని వయస్సుల పాపలు వీటిని ప్రేమించారు. కాబట్టే ఇప్పుడు బ్రిటానియా గ్లాక్సో బిస్కట్లు కుటుంబానికి అవశ్యకమైనవి. పుష్టిగా పెరగడానికి ఎంతో మంచివి.




**భారతదేశంలో అతి శ్రేష్ఠమైన బిస్కట్లు బ్రిటానియా**

® బ్రిటానియా బిస్కట్ కో. లిమిటెడ్ వ్యాపారపు గుర్తును ఉపయోగించుకోడానికి రిజిస్టరు కావింపబడ్డారు.

శ్రీలంకకు కూడా పెట్టుబడులు రాకున్నాయి. ఈ విషయమై నిర్మాతలు, గిల్డు అధ్యక్షులు, డిస్ట్రిబ్యూటర్లు తీవ్రంగా చర్చించి ఒకపరిష్కార మార్గం కల్పిస్తారని తెలుగు ప్రేక్షకులుగా మేము దక్షిణ భారత ఫిలిం అధ్యక్షులను కోరుచున్నాము.

బండారు పాండురంగేశ్వరరావు,
మేకా కృష్ణమూర్తి, కర్రి సతీష్ (కోరుకొల్లు)

### శ్రీనివాస వృత్తం

ఈ సంచికలో నేపధ్య గాయకుడు శ్రీ పి. బి. శ్రీనివాస్ గురించి ఆయన వృత్తం గూర్చి మీరు వ్రాసినది చదివిన తర్వాత ఆ వృత్తం గూర్చి ఇంకా తెల్సుకోవాలన్పించింది. ఈ పద్యరచనా విధానంతో శ్రీ పి. బి. యస్. గారి వోపికను అందరూ మెచ్చుకోవాలి. పద్య లక్షణాలు వివరంగా తెలిపినందుకు మీరు సర్వదా అభినందనీయులు. అందులో యతి విషయం అన్నారు. యతిమైత్రి గూర్చి చెప్ప లేదు. కాని శ్రీనివాస్ తమ పద్యంలో యతిమైత్రిని కూడా వినియోగించారు కదా! రావూరి దొరస్వామి శర్మగారు ఈ ఛందస్సును అభినందించారంటే ఇది అందరికీ అనుసరణీయమనుటలో సందేహము లేదు. ఈ వృత్తము గూర్చి మరింతగా తెల్పెదరని ఆశిస్తున్నాను.

కె. ఉమ, (తెనాలి.)

### గేయాలు

స్వాతంత్ర్య దినోత్సవ సంచికలో ప్రచురితమయిన 'సహృదయా' గేయం, హృదయాన్ని స్పందించింది. రచయిత యల్. మాలకొండయ్య గార్కి ప్రచురించిన తమకు అభినందనలు.

ప్రజల గోడు మరి ఇక
ప్రతి బింబించేదెలా?
తోటి మానవుని జీవిత సమస్యలు
మాటిగా కాలేదా కవితా వస్తువులు?

## ఉత్తరాలు

అని సూటిగా ప్రశ్నించారు రచయిత. సమాజంలో—'ప్రతి నిత్యం పేద వాని బ్రతుకు బాటకు, పోతుతుంటే,ముళ్ళకంచెలు'— నిద్ర పోకుండా సహృదయ కలాలు బయట పెడుతూనే ఉంటాయి.

—కాని పేదవారి బాటను సుగమం చేయ గలిగినవి నిస్వార్థ ఉన్నతాధికార కలాలు, ప్రజా నాయకుల కలాలు మాత్రమే!

ఈ సత్యాన్ని గుర్తించితే శ్రేయోరాజ్య స్థాపన తద్వారా విశ్వ మానవ కళ్యాణము సిద్ధిస్తుంది. అనుటలో అతిశయోక్తి లేదు.

—సత్యశ్రీ, (విశాఖ)

### చిత్రాలు

'28—8—72' మధ్య పేజీలో స్విమ్ సూట్‌తో ఉన్న అందాల మోడల్ అమ్మాయి జెక్కి ఎలన్సర్ పదేపదే చూడాలనిపించే విధంగా వుంది.

—వి. జె. స్వామి, (భువనేశ్వర్)

### ఆకాశవాణి

ఆకాశవాణి ప్రాంతీయ వార్తలను రోజూ సా. 6—05 గం. మాత్రమే ప్రసారము చేయుచున్నారు. అందువల్ల యీ రోజు సాయంత్రం పైగా జరిగిన విషయాలు రేపు సాయంకాలము వార్తలలోనే వినుటకు వీలుంది. అందువల్ల కొన్ని వార్తలు చాల ఆలస్యంగా శ్రోతలు వినవలసి వస్తుంది. కావున మద్రాసు—ఏ కేంద్రము వలె అదనంగా మరో 5 నిముషాలు, 'ప్రాంతీయ వార్తల'ను ఉదయానగాని లేక మధ్యాహ్నమునగాని ప్రసారము చేయవలసినదిగా ఆకాశవాణి అధికారులను కోరుచున్నాను.

గుడిమెట్ల చెన్నయ్య, (మద్రాసు)



ఆంధ్రసచిత్ర వారపత్రిక
వ్యవస్థాపకులు:
దేశోద్ధారక కాశీనాథుని
నాగేశ్వరరావు పంతులుగారు
శివలెంక శంభుప్రసాద్
సంపాదకుడు
(1938 - 1972)
సంచిక వారం: 29-9-72
శ్రీ పరీధావి నామ సం॥ ఆశ్వయుజ మాసం॥ బ॥ సప్తమి
సంపుటము: 60 సంచిక: 3
స్థాపితము 1908
సంపాదకుడు:
శివలెంక రాధాకృష్ణ
ఆంధ్రపత్రిక కార్యాలయము
7, తంబుచెట్టి వీధి, మద్రాసు - 1
విడి ప్రతి వెల 50 పైసలు

## విషయానుక్రమణిక

ముఖచిత్రం: నటి హేమమాలిని
(ఫోటో: వి. ఎస్. కె. మణి)
రెండవ అట్టపేజీలో: వెంకన్న'స్ కోట్లు
(కార్టూన్ సీరియల్)


దౌర్జన్య తరంగాలు
అలజడులు
అధికార కాంగ్రెస్
సుడిగాలి


పరస్పర సదభిప్రాయాలు
అడుకునేదేమిటి?




కాంగ్రెసును శుభ్రపరచనివ్వకపోతే పోనీ, పరిశుభ్రమవుతాను.
హనుమంతయ్య


ముఠావాదివి! సామ్రాజ్యవాదివి దుర్మార్గుడివి
నాడు


రెండు నాలుకల వాడివి దొంగదారి తొక్కే వాడివి - పాపివి


అమెరికా- చైనా భాయీ-భాయీ!
నేడు

# హైదరాబాద్ నోట్‌బుక్

## తిరుమల రామచంద్ర

ఈ శతాబ్దంతో పుట్టి పెరుగుతున్న శ్రీ కృష్ణదేవరాయ ఆంధ్రభాషా నిలయము సెప్టెంబర్ 1 వ తేదీన 73 వ పుట్టినరోజు పండుగ చేసుకొన్నప్పుడు చాల అపూర్వ విషయాలు తెలిశాయి శ్రోతలకు. ఒక వ్యక్తి 70 సంవత్సరాల జీవితంలోనే ఎన్నో అనుభవాలు ఉంటాయి గదా! మరి ఒక సంస్థ జీవితం ఎన్ని కొత్త వెలుగులు విరజిమ్ముతుందో చెప్పనక్కరలేదు! మాజీ మంత్రి శ్రీ అక్కిరాజు వాసుదేవరావు అధ్యక్షతన జరిగిన ఈ ఉత్సవంలో శ్రీ కోదాటి నారాయణరావు ఈ సంస్థ పూర్వ చరిత్రను వివరించగా, శ్రీ కప్పగంతుల లక్ష్మణశాస్త్రి సంస్థ రజతోత్సవం శ్రీ కాశ్యకంత గణపతిశాస్త్రి అధ్యక్షతన జరిగిన వైభవం వివరించగా, శ్రీహరి ఆదిశేషువు శ్రీ కాశీనాథుని నాగేశ్వరావు మొదలయిన వారు దీనికి చేసిన ప్రోదిన తెలుపగా శ్రోతలు పరవశులై సంస్థ చరిత్రను హాస్యార్థ సూచనగా చెప్పే శ్రీ లమావా కవితతో ఆనందిస్తూ, కార్యదర్శి శ్రీ వి. ఎస్. నరసింహారావు ధన్యవాదాలు విని ఇదేమిటి ఇంతలో సమాప్తమయిందా? — అని ఆశ్చర్యపడ్డారు. కొను సత్కాలక్షేపం అలాగే ఉంటుంది మరి!

* * *

జలియన్‌వాలాబాగ్ దురంతసంఘటన విని కరిగిపడతారు విన్నవారు. అలాటిది ఆంధ్రప్రదేశ్‌లో జరిగింది. ఆనాడు అది ఘోరమైనా, ఈనాడు మధురస్మృతిగా, వీరస్మృతిగా మిగిలి యువకులకు ఉత్సాహవర్ధనిగా ఉంది. ఆ మహాసంఘటన వరంగల్ జిల్లా పర్కాలలో జరిగింది. 1948 సెప్టెంబర్ 2 వ తేదీన 20 వేలమంది పర్కాల మార్కెట్ మైదానంలో శ్రీ ఎస్. మనోహర్‌రావు నాయకత్వంలో జాతీయ పతాక వందనానికి సమావేశమయ్యారు. నిజాం పోలీసులు, రజాకార్లు ముందు హెచ్చరికయినా చేయకుండా, విచక్షణ లేకుండా ఆ నిరాయుధ దేశభక్తులపై కాల్పులుసాగించారు. 20 మంది అక్కడికక్కడే మరణించారు. కొన్ని వందల మందికి గాయాలు తగిలాయి. తూటాలు దేహంలో ఉండిపోయినవారూ ఇంకా జీవించి ఉన్నారని శ్రీ కోదాటి నారాయణరావు నాతో చెప్పినప్పుడు నా ఒళ్లు పులకరించింది. ఈ వీరసంస్మరణ దినోత్సవం మంత్రి శ్రీ హయగ్రీవాచారి అధ్యక్షతన మహావైభవోపేతంగా జరిగింది. శ్రీ కోదాటి నారాయణరావు, మాజీమంత్రి శ్రీ ఎం. ఎస్. రాజలింగం రాష్ట్ర కాంగ్రెస్ కార్యదర్శి శ్రీ చక్రపాణి మొదలయినవారి ప్రసంగాలతో పర్కాల సభామండపం ప్రతిధ్వనించింది.

* * *

ఆదేమి దురదృష్టమో భౌతిక శాస్త్రాల విషయంలో మనకు మధ్యకాలంలో కలిగిన ఉపేక్ష ప్రాణదాతలు, ప్రాణాచార్యులు అయిన వైద్యులు అపాంక్తేయులన్నంత వరకు దిగజారి, శాస్త్రాలే లుప్తమైపోయి, కేవలం తాత్కాలికానందం కలిగించే కావ్యాలపాలు, ఖండాలపాలు ప్రధానమైపోయాయి. కాని, ఎవరైనా గత వైభవం జ్ఞాపకం చేసినప్పుడు, క్షణం పాటు సంతోషం, సహస్రాబ్దాలసేపు సంతాపం కలుగుతాయి. ఆగస్టు 31 న ఇండియన్ మెడికల్ అసోసియేషన్ హాలులో డాక్టర్ కె. సుధాకరశాస్త్రి అధ్యక్షతన బెనారస్ విశ్వవిద్యాలయం వైద్యాచార్యుడు డాక్టర్ పి. జె. దేశ్‌పాండే సుశ్రుతుడు ఆనాడే ప్లాస్టిక్ సర్జరీకి మూలమైన పద్ధతులతో పాటు చికిత్సా ప్రయోగాలు చెప్పాడని ప్రసంగించినప్పుడు. ఆగస్టు 18, 19, 20 లలో ప్రొఫెసర్ ఆర్. ఎ. మానిక్షా అధ్యక్షతన అఖిలభారత ప్లాస్టిక్ సర్జన్ల సంఘం సప్తమ మహాసభలో పలువురు విద్వాంసులు సుశ్రుతాచార్యుని స్మరించినప్పుడు ఎన్నో శస్త్రచికిత్సాంశాలు సామాన్య



వెల్లూరులో ప్రకాశం పంతులుగారి విగ్రహానికి శ్రీ భాట్టం శ్రీరామమూర్తి (విద్యాశాఖ మంత్రి) శంకుస్థాపన చేశారు. గోపాలకృష్ణారెడ్డి (ఛైర్మన్ జి. ప.), శ్రీ ఆర్. ఎల్. రెడ్డి, శ్రీ పార్థసారథి (కలెక్టర్) ఈ ఫోటోలో వున్నారు.

ప్రజలకూ తెలిశాయి. ఈ మహాసభ రెండవనాటి సమావేశంలో కాల్పులవల్ల కలిగే ప్రమాదాలు, తన్నివారణోపాయాలు మొదలయిన విషయాలను గురించి పలువురు నిపుణులు ప్రసంగించారు. మన దేశంలో మహిళలు, పిల్లలు అగ్నిప్రమాదాలకు తరచు గురి అవుతుంటారు. పిల్లల దేహం చిన్నది గనుక మంటలు వెంటనే ప్రమాదం కలిగిస్తాయి. ప్లాస్టిక్ సర్జన్ల మహాసభ ఈ నివారణోపాయాలు తెలిపి, ప్రజా-మాన్యాలకి చాలసేవ చేసింది.

* * *

ఆంధ్రప్రదేశ్‌కు ఏటా వచ్చేవి మూడు —అగ్నిప్రమాదాలు, అనావృష్టులు, వరదలు. ఈసారి అనావృష్టి మనను మరింత తీవ్రంగా చూచింది. ప్రకృతి వైపరీత్యానికి మనం ఏమి చేయగలం, చేతులెత్తి, నింగిని చూస్తూ, భగవంతుని ప్రార్థించడం తప్ప? విరాటపర్వ పఠనాలు, యజ్ఞాలు ఆచరించడం తప్ప? ఇలాటివి జంట నగరాలలో చాల జరుగుతున్నాయి. వీటిలో ముఖ్యంగా పేర్కొనదగింది పూరీ శంకరాచార్యులవారు లాల్ దర్వాజావద్ద వున్న వేంకటేశ్వర మహాదేవ మందిరంలో ప్రారంభించిన మహారుద్రవరుణ యజ్ఞం, ఆగస్టు 25 నుంచి సెప్టెంబరు 1 వ తేదీవరకు అత్యంత శ్రద్ధాభక్తులతో జరుపబడింది. వేలాది భక్తజనం ఈ యజ్ఞాన్ని తిలకించడం చూడగా; జనంలో—అవశమైన జనంలో ఎంత ఆవేదన, ఆందోళన ఉన్నాయో స్పష్టమయింది.

* * *

పరిపాలకులలో పరిశోధన ప్రవణత అరుదైనా, భారత పరిపాలకులకు దూరమైన సంప్రదాయం కాదు. మెకంజీ, ప్రిన్సెప్, టెయిలర్ మొదలయినవారు ఆధునిక పరిశోధన పద్ధతికి బాటలు తీర్చారు. ఆ సంప్రదాయాన్ని పుణికి పుచ్చుకొన్నారు శ్రీ ఎన్. రమేశన్. రాష్ట్ర ప్రభుత్వ ఆర్థిక కార్యదర్శి పదవిని నిర్వహిస్తూనే పరిశోధన లతను పెంచారు. దాని నవకుసుమం 'పల్లవ; తెలుగు చోడ చరిత్రలో పరిశీలన' అనే గ్రంథం. దీనికి పూనా విశ్వవిద్యాలయం పి. హెచ్. డి. పట్టం ప్రసాదించింది. ఈ గౌరవం పొందినందుకు ఆగస్టు 28 వ తేదీన రాష్ట్ర పురాతత్వశాఖ కార్యాలయంలో విద్యాశాఖ కార్యదర్శి శ్రీ రామమూర్తి అధ్యక్షతన జరిగిన సన్మానసభలో ప్రముఖ చరిత్రకారులు డాక్టర్ నేలటూరి వేంకటరమణయ్య, హెచ్. కె. షేర్వానీ పురాతత్వ శాఖ డైరెక్టరు శ్రీ వహీద్‌ఖాన్ వంటి వారు శ్రీ రమేశన్ చరిత్ర పరిశోధన ప్రతిభను, శ్రీ ఎల్. ఎన్. గుప్త వంటివారు పరిపాలన దక్షతను, శ్రీ కె. లక్ష్మణశాస్త్రి, శ్రీ నార్ల వేంకటేశ్వరరావు వంటి వారు రచనా కౌశల్యాన్ని ప్రశంసించారు. సన్మానసభ గాన నృత్యాలతో కుతుబ్‌షాహీల దర్బారును తలపించింది.

* * *

ఆగస్టు, సెప్టెంబర్ నెలలు ప్రదర్శనాల ఋతువన్నా ఆశ్చర్యం లేదు. రకరకాల ప్రదర్శనలు జరిగాయి, జరుగుతున్నాయి. వీటిలో విజ్ఞాన వినోదదాయకమైనది భాగ్యనగరంలోని జవాహర్ బాలభవన్‌లో ఏర్పాటు చేసిన 'ప్రపంచపు ప్రాచీనయుగం' అనేది. జవహర్‌లాల్ నెహ్రూ తరంకింద తన కుమార్తె శ్రీమతి ఇందిరాగాంధీకి వ్రాసిన లేఖలు ఆధారంగా బాలల జాతీయ మ్యూజియం ఏర్పాటు చేసిన ఈ ప్రదర్శనలో భూగోళం ఎలా పుట్టిం, మానవుడు ఎలా విస్తృత కనుగొని నేటి నాగరకత పరిణమించిందో తెలియజేసింది. సెప్టెంబర్ 12 వరకు తండోపతండాలుగా జనాన్ని ఆకర్షించిన ఈ ప్రదర్శనం పెద్దలకు కూడ విజ్ఞానం పంచిపెట్టిందనడానికి జనసందోహమే సాక్షి.

* * *

ఉపశ్రుతి :—

ప్లాస్టిక్ సర్జరీ మహాసభనుంచి వస్తున్నాను. 'ఏమిసభసాబ్' అన్నాడు దారిని పోయే ఒకవ్యక్తి. పేరు రాములు. ఒక చిన్నసెలూన్ యజమాని. ప్లాస్టిక్ సర్జన్లసభ గురించి వివరించాను. 'మాతాత బలేబాగా వుండ్లు కోసేవాడు. ఎముకలు కలిపేవాడు!' అన్నాడు రాములు. ఔను మన పూర్వులంతా గొప్పవారే! ఆ భావధార, పరిశోధనధార పోయాయి; ప్రతి వృత్తిలోను — అనుకున్నాను, విచారంతో, మరొకసారి. ●

షూరిరా౯.









# అనామధేయుడి ఆత్మకథ

## —ఆర్వీయ—

### —సీరియల్ హాస్యరచన—

## 9

మామూలుగా, మా ఆవిడ వెళ్ళి, నేను బజారులో కొన్న కూరలు పుల్లాయమ్మగారికి చూపించింది. ఆవిడ కూడా మామూలు ధోరణిలో ఏలాకొన్నారని అడిగి, ధరలు తెలుసుకొని, అనుకున్నట్లుగానే పెదవి చప్పరించింది.

'ఏవండీ ఊరుకున్నారు? కూరలెలా గున్నాయి?'

'అలాగేవున్నాయి. కాని ధరలు చాలా ప్రియంగావున్నాయి. హెచ్చుధరలు మీకు అలవాటేగా!' అని ఒక విసురు విసిరిందామె.

'ఇంత తాజా కూరలరేటు మార్కెట్లో అంతేనటండీ' అని మా ఆవిడ.

'అబ్బే! ఇంత ప్రియమా! మా ఆయన చూడండి.. ఎంత చవగ్గా కొన్నారో!' అని ధరలెలా ఎలా అని వివరించి చెప్పింది. చూస్తే, ధరలు తక్కువే!

'మా కూరలు తాజాగావున్నాయి. మరి మీ కూరలు తాజాగా వున్నాయా?' మా ఆవిడ కాస్త ధైర్యంగా విసిరింది.

పుల్లాయమ్మగారికి కోపం వచ్చింది. తటాలున లేచి నిలబడింది.

'ఏవనమ్మాయ్! నాసిరకం కూరలు, అధిక ధరలు మీ సంసారంలో చెల్లింది కాని, మా సంసారం అతిఖచ్చితంగా నడుస్తుంది. ధర కారు చవగ్గా వుండి, కూరలు నవనవలాడుతూ తాజాగా వుండకపోతే మా ఆయన అసలు కూరలు కొననే కొనరు. అథవా ఆయన అలాచేస్తే నేను ఛస్తే వూరుకోను. నేను అందరు అమ్మలక్కలాంటిదాన్ని కాను!' అని ఝుణాయించింది.

ఔను. నిజమే! అందుకే, మీ కుటుంబాన్ని చూసి అయినా నేర్చుకుందామని నా తాపత్రయం.' అని మా ఆవిడ సమాధాన ధోరణిలో చెప్పడంతో ఆవిడ కాస్త మెత్తబడింది.

'ఏదీ మీ కూరలు కొంచెం చూపించండీ...మా ఆయనకి చూపించి నాలుగు చీవాట్లేస్తాను.' అంది మా ఆవిడ.

పుల్లాయమ్మ కొంచెం తెల్లబోయింది కాని సర్దుకొని. 'ఛ్ఛే—ఇలాంటి చిల్లర విషయాలు మొగవాళ్ళదాకా వెళ్ళడం మెందుకూ?' అని కొట్టి పారేసింది.

'అలాక్కాదు. ఆయనకి చూపించి నాలుగు చీవాట్లేస్తేగాని మా కుటుంబం కుదుటబడదు!' మా ఆవిడ పట్టు పట్టింది.

'పోనిద్దురూ, ఈ ఘోష మొగాళ్ళదాకా పాకిందంటే రభస తప్పదు. వద్దులెద్దురూ!' అంది ఆమె.

మా ఆవిడ ససేమిరా దానికి ఒప్పుకోలేదు: పుల్లాయమ్మ అప్పటికీ చెప్పింది అందరి కళ్ళూ పడితే కూరలకి దృష్టిదోషం తగులతుందని!

మా ఆవిడ మొండిపట్టుపట్టి మొరాయిస్తూంటే ఆమె విలవిల్లాడిపోయింది. మరి చూపించక తప్పని గడ్డుపరిస్థితి ఏర్పడింది.

ఆ కూరల్ని చూసేటప్పటికి మా ఆవిడ కళ్ళు ఒక్కసారి 'జిగేల్'మన్నాయిట. వంకాయలు 'గుత్తివంకాయ కూరోయ్ బావా' అనిపించే బదులు 'పుచ్చివంకాయ కూరోయ్ దేవా' అనిపించేట్లున్నాయి. బంగాళాదుంపలు సరే సరి. కారణవశాత్తూ బంగాళాదుంప అవతారం ఎత్తిన మహాప్రాజ్ఞుడైన ఇంద్రుడిలాగున్నాయి. బెండకాయలు నీళ్ళల్లో తడవక, అగ్గిలో కాలవు అన్నట్లున్నాయి. దొండకాయలు ముట్టుకుంటే నీరు అయిపోతామని బెదిరిస్తున్నాయి.

దాంతో మా ఆవిడ కొంత దర్జాపడి ఇరుగుపొరుగు మాటలు విని నామీదపడటం విరమించుకుంది. ఈ కథ యిలా జరుగుతుందని మీకు మొదట తెలుసా — అని అడుగుతారేమో పాఠకమహాశయులు.

మొదట జరిగిన కథని కళ్ళారా చూస్తే, ఈ కథ ఇలా పరిణమిస్తుందని యోచించే మా ఆవిడని కూరలు తీసుకొని రమ్మని గట్టిగా పురమాయించేను. ఎందుకంటే పుల్లాయమ్మ మొగుడుగారు బజారుకి వెళ్ళొస్తుండడం చూసి నేనొక సి.ఐ.డి.లా ఆయన వెంటపడ్డాను. ఆయన ఓపిగ్గా అన్నిగంపలు అన్ని దుకాణాలూ తిరిగి, ఏరి ఏరి అన్ని పుచ్చువంకాయలు, కుళ్ళు బంగాళాదుంపలు, సంగ దొండకాయలు, 'బలే చౌకబేరం' అన్నట్లు మహా చవగ్గా కొనిపారేస్తున్నప్పుడు అర్ధరూపాయి డబ్బులతో అరబస్తా కూరలు అలాగే కొనుక్కొచ్చేడు. నేను మా కూరలు కొనుక్కొని ఆయన కళ్ళబడకుండా వచ్చేశాను. దీనికి ఇంత తెరవెనుక భాగోతం వుంది. తరువాత కథ మీకు తెలిసినదే!

* * *

ఈ కొంపలో యిన్ని చికాకులొచ్చేయని మరో అద్దె కొంపలోకి మారేం. కాని ఆ

అద్దె కొంపలో మరికొన్ని చిక్కులు తట స్థించేయి. నూతిలోంచి సముద్రంలో గెంతినట్టయింది మా పరిస్థితి. ఈ ఇల్లు రెండంటే రెండే భాగాలు. ఒక భాగంలో ఇల్లు గలవాళ్ళు వున్నారు. ఆ రెండో భాగంలో నేను దిగేము. ఇల్లుగల వాళ్ళూ మేమూ తప్ప మరెవరూ అద్దెకున్నవాళ్ళు లేరని ఎంతో సంతోషించేను. ఆ ఇంట్లో సాధారణంగా ఎవరూ దిగరట, కారణం దురూహ్యం కొంతమంది అంటారు— ఆ యిల్లుగలవాళ్ళ బాధ పడడం కష్టం— అని మరికొంతమంది అంటారు—పిల్లలున్న వాళ్ళకి వాళ్ళు అద్దెకివ్వరు—అని! ఇంకా మరికొంతమంది అంటారు — వాళ్ళకి లోబడి తిరుగుతారన్న నమ్మకం వుంటే గాని అద్దెకివ్వరు—అని. ఇంకా మరో కొంతమంది అంటారు—ఆ ఇంట్లో దిగడం కన్న గంగలో దిగడం మంచిది. ఇల్లంతా ఉరుస్తుంది. గాలి రాదు. జాగా కుశలం —అని ఏవ్వరేమన్నా ఖాతరు చెయ్యకుండా ఆ యింట్లో దిగిపోయేం.

ఆ ఇల్లు గలవాళ్ళు మాకు వెంటనే ఇల్లు ఇవ్వడానికి కారణం తరువాత తెలిసింది. కటి. మా ఇంట్లో పిల్లలు లేకపోవడం. రెండు నేను ఆఫీసు గుమాస్తాని అవడం. 'ఆఫీసుగుమాస్తా గిరీకి, అద్దె యింటికీ సంబంధం యేమిటయ్యా?' అని అనకలరు. అమ్మనాన్నా, అలా కొట్టి పారేయకండి. అవినాభావ సంబంధం వుంది. అధవా, కొందరి వుద్దేశ్యంలో వుంది. ఆఫీసు గుమాస్తా, బడిపంతులు, పోస్టుమేస్టరు మొదలైనవాళ్లు చాలా పెద్ద మనుషులు— అంటే అతిమేధావులు— అని ఒక ప్రతీతి. దీనికి అపవాదం వుంటే వుండవచ్చు కాదనను. కాని అది లెక్కలోకి రాదు. సాధారణంగా వీళ్ళు పేచీకోరు మనుషులు కాదని చాలమంది నమ్మకం. ప్లీడరు గుమాస్తాలు, పత్రికా రచయితలు, పోలీసువాళ్ళు, చెట్టుకింద ప్లీడర్లు మొదలైనవాళ్ళ దారి వేరు అని కొంతమంది అనుకుంటారు. ఆఫీసు గుమాస్తా నవడంవల్ల నాకి సుఖమైంది .. మా ఇల్లు గలవాళ్ళకి ఎనిమిదేళ్ల సుపుత్రుడున్నాడు 'అప్పన్నే గరు ఎయ్యా!' అన్నట్టు వీడు రణానికి ఈడుకి మించిన మాటలు. సైజుకి మించిన తిండి ప్రష్టి ఆ కుర్రడికి పెట్టని సొమ్ములు!

వాళ్ల ఇంట్లో తిన్నది చాలక పొరుగింటి పుల్లకూర కావాలి. రోజూ ఏదో ఒకటి మా ఇంట్లోంచి ఇవ్వకపోతే ఆరోజు వాళ్ల ఇంట్లో బువ్వ ముట్టడు. అందుచేత వీడికోసం మేము రోజూ ఏదో ఒకటి చేసివ్వాలి. మా ఇంట్లో ఏ ఇబ్బంది పడినా వాడికేదో ఒకటి ఇవ్వకపోతే వాడి అల్లరే కాక వాళ్లమ్మ సాధింపుకూడా పడాలి. పేచీవస్తే ఆ ఇంటికే 'ఉద్వాసయామి' అనవచ్చు. కాబట్టి ఈ 'రోజా చుట్టం'కి కూడా కొంత గృహ బడ్జెట్టులో స్థానం కల్పించి, రోజుల నెట్టుకొస్తున్నాము.



ఇట్లుండ, ఒకసారి ఆ అర్భకుడి తల్లిదండ్రులు అర్జంటుగా పనిమీద వూరికి వెళ్లవలసి వచ్చింది. వీడికి స్కూలు పోతుందేమో అని ఆ వారంరోజులూ మా ఇంటోవుంచి వెళ్ళిపోయారు. స్కూలు పోవడమేమిటి, వీడి అల్లరి పడలేక ఇంట్లోనే ఇంత అల్లరి. ఇక బైట చెప్పేదేముంది? అందుచేత ఆ అల్లరిని ఊరిగాళ మీద రుద్దేద్దామని తల్లిదండ్రుల పథకం. అల్లరి వుండదు. వాళ్లకి వీడి ఖర్చు వుండదు. 'ఏకకియాద్వ్యర్థకరీ'. అని. ఈ సంగతి పైకి అనడమే!

మొదటిరోజు వాళ అమ్మానాన్నా, లేకపోవడం చేత చాలా నెమ్మదిగా బుద్ధిగా వున్నాడు. అప్పుడు విప్పి చూస్తే 'వాడే వీడా!?' అనిపించింది. పిలవగానే పలకడం. రమ్మనగానే రావడం అధిక ప్రసంగం చెయ్యకపోవడం. అనవసర ప్రసంగంలోకి దిగకపోవడం. అంతా ఆద్భుతం, మొదటి రోజు.

రెండో రోజున భోజనాల దగ్గర ఆముదం తాగినవాడిలా మొహం పెట్టేడు. 'ఏమిరా, డింభకా?' అని నేను ప్రశ్నించేను.

'నాకు పప్పు వద్దు'

'ఏంరా?'

'నాకు నయించదు'

మా ఆవిడ అంది!

'పోనీ వంకాయ మెంతికూర కలుపుకోరా. అబ్బాయా?'

'ఆహా...నాకది ఏమీ నయించదు.'

నేనన్నాను: 'కొబ్బరికాయ పచ్చడో?'

'అదంటే నాకు డోకు.'

'మరేమిటి తింటావు నీ మొహం!'

'కాకరకాయ వేపుడూ, కందిపచ్చడి.'

'అలాగా.'

'అవే మా యింట్లో ఎప్పుడూ వండుకుంటాం.'

'సరేలే—బాగుంది!'

'అదే మా అమ్మ చేసినట్టు చేస్తేనే నాకు నయిస్తుంది, లేకపోతే

తయుండదు!'

'ఒహో!'

మూడోరోజుకి చనువు ఎక్కువైనట్టుంది, నేను స్నానం చేస్తున్నప్పుడు వ్యాఖ్యానం ప్రారంభించేడు.

'మానాన్న ఎప్పుడూ మంచి ఎర్ర సబ్బులే వాడుతూ' 'వుంటాడు. ఇదేమిటి ... తెల్లతెల్లగా వచ్చవచ్చగా వుంది...?'

నేను వాడుతున్నది మైసూర్ శాండల్ సోప్. పాపం, ఈ కుర్రవాడికి 'లైఫ్ బాయ్' సబ్బుకన్న ప్రపంచంలో మంచి సబ్బులు లేవని ఒక అభిప్రాయం. ఎందుకంటే అది ఎర్రగా బుర్రగా వుంటుందని కాబోలు!

'మానాన్న కొబ్బరినూనె తప్ప ఈ కంపు నూనె రాసుకోడు.'

వాసననూనెకి వచ్చినపాట్లు.

'మా నాన్న పొత్తు పంచే కట్టుకుని

# అనామధేయుండి ...

భోజనంచేస్తాడు. కాని ఇలాంటి చీర కట్టుకోడు!'

నేను కట్టుకున్నది పెద్దాపురం పట్టు పంచె. అది వంగపండు ఛాయలో వుంది. రంగుబట్టల్ని చీరలకిందే జమ!

నాల్గోరోజు...

'మీ ఇల్లంతా బోడిగా వుంది. మా ఇంట్లో మా నాన్న అంచక్కా ఎన్నో కేలండర్లు—చక్కటి బొమ్మలని తెచ్చి గోడలికి తగిలించేడు.'

'మీ నాన్నకి బొమ్మలన్నా కొమ్మలన్నా చాలా ఇష్టంలే!'

మా ఆవిడ ఫకాలున నవ్వింది.

ఆ కుర్రాడికి బోధపడలేదు.

'నాకూ బొమ్మలంటే ఇష్టమే!' అన్నాడు వాడు.

'ఔనౌను. ముందు ముందు నీ వల్లే చిత్రకళ ఉద్ధరింపబడాలి.'

'మీ ఇంట్లో అక్కబొమ్మలు, కర బొమ్మల, మట్టిబొమ్మలు...ఏమీ లేవు. మా ఇంట్లో ఎన్నో వున్నాయి...'

'ఔను.'

'మీ ఇంట్లో ఎందుకు బొమ్మలు లేవో చెప్పనా?'

'చెప్పు చెప్పూ!' అని నేనూ మా ఆవిడా ఒక్కసారే అన్నాం. ఏం చెప్తాడో అని!

'మీ ఇంట్లో పిల్లలు లేరు; అందుకని—' అని పెద్ద డిస్కవరీ చేసినవాడిలా తేలిగ్గా చెప్పేడు

కొంచెంగా నొచ్చుకున్నాం మేము. మా మౌనం అర్ధాంగీకారం కింద తీసుకొని. తన మాటల్ని ఆసక్తిగా మేము వింటున్నాం అన్న అపోహలో రాజకీయనాయకుడిలా మొహం పెట్టి— 'మీ యింట్లో ఎందుకు పిల్లల్లేరు?' అని మమ్మల్ని గట్టిగా ప్రశ్నించేడు.

చచ్చేనురా భగవంతుడా అనుకున్నాను.

ఐదోరోజు...

కాఫీ తాగుతూంటే, మా డింభకాగ్రేసరుడు తుమ్ముకున్నాడు. ఆ తుమ్ము దెబ్బకి నా చెయ్యి వణికి. చేతిలోని కాఫీ కప్పు జారిపోయింది. ఒక్క చుక్కయినా నోట్లో పడలేదు. తాగుదామని నోటిదాకా కప్పు వెళ్ళింది. వెంటనే జారిపోయింది. ఎవడో ఇంగ్లీషువాడు 'మెని ఎ స్లిప్ బిట్వీన్ ద లిప్ అండ్ కప్' (కప్పు పెదవి మధ్య విఘ్నంబు లెన్నియో!) అన్నట్టు తు. చ. తప్పకుండా జరిగింది. పడిన కప్పు శతధా సహస్రధా భిన్నమైంది.

'మీకు బుర్రలేదండీ!' మా డింభకాసుర ఉవాచ.

'నోర్మూయ్' అని కోపంతో అరిచేను. తర్వాత పాపం అర్భకుడు కదా అని నొచ్చుకుని, 'ఎందుకబ్బాయ్, అలా అన్నావు? పెద్దవాళ్ళని అలా అనొచ్చునా?' అని బుజ్జగించేను.

'మా నాన్న మొన్న కాఫీ కప్పు ఎత్తేసినప్పుడు మా అమ్మ మా నాన్నని యిలాగే అంది.'

'అదిసరే కాని, నువ్వలా అనకూడదు!'

'అలాగే' అన్నట్టు బుర్ర ఊపేడు.

ఆరో రోజున వాడేమీ అనలేదు స్తబ్దుగా కూర్చున్నాడు. నాకు భయం వేసింది. 'ఏమిరా దేవుడా, 'వీడు' 'వీడి' లాగ లేడే!' అనుకున్నాను. తిరిగే కాలు కూర్చున్నా, భయమే. తిట్టే నోరు ఊరుకున్నా భయమే! ఆరోజు రోజల్లా అలాగే వున్నాడు. వీడికి గాని జ్వరం తగిలిందేమోనని చెయ్యి పట్టుకుని చూశాను. మామూలుగానే వుంది. అమ్మా నాన్నల మీదకి మనస్సు మళ్ళి బెంగ పెట్టుకున్నాడా? లేదే. ఉషారుగానే వున్నాడు. కాని మాటలేదు. ఇది మంచికొచ్చిందా చెడ్డకొచ్చిందా అని నా భయం!

దీపాలు పెట్టే వేళయింది. అలా షికారు తిరిగి ఇంటికి వస్తున్నాను. ఇల్లు సమీపించేటప్పటికి—

ఓహోరి అందగాడ! బంగారు మావా!' అని సన్నగా పాట మా యింట్లోంచి వినవస్తోంది. అది మా ఆవిడ కంఠం కాదు.

వెంటనే ప్లేటు మారింది.

'గోదావరి పుష్కరాల వింతలూ...'

ఇంటి దగ్గరికి వెళ్ళేటప్పటికి—

'గైరమ్మొదినో నా మీద దయగాలుచుమా!'

ఇంటివాకిలి చేరుకునేటప్పటికి—

'అందిన ఇంద తీసుకో...ఇంద ఇంద...'

వారపత్రికలో పతాక శీర్షికలు చూస్తున్నట్టు, సినిమా రీలుమీద తారాగ

వివరణ చూస్తున్నట్లు, పెళ్ళివి ఆలాపన చేస్తున్నట్లు — త్నే ఒక్కొక్క చరణం పాడుతున్నాడు ఎవడు ?

'అపస్వర సంగీత మహోపాధ్యాయ' 'వికటగుణ గణ విరాజమాన' మన డింభకాగ్రేసరుడే!

'ఈ పాటలన్నీ ఎక్కడ నేర్చుకున్నావురా అబ్బీ?' అని అడిగేను.

'ఇవాండీ ? మా నాన్న అప్పుడప్పుడు పాడుతుంటాడండి మెల్లిగా. నాకూ వచ్చేశాయి. నేను పాడితే మాత్రం మా నాన్న ఒప్పుకోడండీ. ఇప్పుడు మా నాన్న లేడుగా! అందుకని అన్నీ పాడేస్తున్నాను.'

'బాగున్నాయిలే!'

బాగున్నాయండీ? ఇంకా చాలా వొచ్చు. 'అప్పనా తనామనా మారోరె బైరన్నా'— 'అప్పనా కొండకి—ఎప్పాడెళ్ళినగాని—సెప్పకుంటే సేలా సిగ్గులమ్మా!...'

'ఓహో! చాలా నేర్చావే'

'అన్నీ పాడనాండీ?'

'బాబ్బాబు! వద్దొద్దు! నీ పుణ్యం వుంటుంది' అన్నాను.

దాంతో కొంచెం తగ్గేడు.

మా ఆవిడ వాళ్ళమ్మ అంత బాగా వుండదనీ, నా కన్నా వెళ్ళ నాన్న తెలివైన వాడనీ, వాళ్ళ నాన్న ఉద్యోగం చాలా చాలా పెద్దదనీ, వాళ్ళింట్లో ఉన్నన్ని కుర్చీలు మా ఇంట్లో లేవనీ. మా ఇంటినిండా ఒక్క పెద్ద పందిరి మంచం తప్ప నులకమంచాలు తప్ప లేవని—వగైరా వగైరా వ్యాఖ్యానాలతోటీ, అభిప్రాయాలతోటీ మమ్మల్ని ఉక్కిరిబిక్కిరి చేయటం చాలక—కొన్ని గాజుగ్లాసుల్ని నామరూపావశేషం లేకుండా బద్దలుకొట్టి, మంచాన్ని రైలులాగ ఈడ్చబోయి కాలు విరగగొట్టుకుని, కుర్చీ కాళ్ళని విరిచి పొయ్యికి తగిన పుల్లలుగా మార్చి—మొత్తానికి మా ఇల్లుతీసి పందిరి వేశాడు. ఇంతలో మా అదృష్టవశాత్తూ వాళ్ళ అమ్మా నాన్న వచ్చేరు. మా మనస్సులు కుదుటబడ్డాయి.

ఒకనాడంతట వంటావిడా, వాళ్ళ కొడుకు (అంటే మన డింభకాగ్రేసరుడు) మరికొంత మంది ఆడవాళ్ళు మా ఇంటి సావిట్లో కూర్చున్నారు. ఏదో పిచ్చాపాటీ, మంచి చెడ్డా. అది ఇదీ, రామాయణం, శ్రీమాయణం, లోకాభి రామాయణం, కబుర్లూ, కాకరకాయలూ —ఏవో వీటిలో పడ్డారు.

(ఇంకా వుంది)

# మా ఇంట్లో సెన్సారెవరు?

కె. రామలక్ష్మి



'ఎంత పిల్లలయితే మటుకు రోడ్డుమీద కళ్లు మూసుకుని నడవరు కదా!' అంటుంది ఓ నవ్వాయి. ఆ పోస్టర్లు చూడు. ఆ ఆడవాళ్ళని చూడు. ఆ డ్రెస్సులు చూడు' అంటుంది. నిజమే బజారులో పేపరు కొనడానికే కిళ్లీకొట్టు దగ్గిరికేనా వెళ్ళండి— తోరణాలుకట్టి వేలాడుతూ వుంటాయి—రకరకాల పత్రికలు. వాటి కవరు పేజీలు వార్నిష్‌వేసి మిలమిల మెరుస్తూ చూపరులను ఆకట్టుతూ వుంటాయి. యిటూ అటూ చూసి ఎవరూ చూడ్డంలేదని చూసి—ఆ పత్రికపేరు కూడా చెప్పకుండ 'అదొకటియ్యి' అంటూ అందుకుని చుట్టచుట్టి పెట్టెకు చక్కా వస్తారు. ఏం సినిమాలున్నాయి? ఏం వినోదాలున్నాయి అని పేపరు తిరగయ్యాన్నే చూడండి. అమ్మాయిలు! సెక్సు! సంగీతం! అంటూ ప్రకటనలు వుంటాయి. అంతెందుకు? రోజూ మగవాడువాడే బ్లేడుకీ షేవింగు క్రీముకీ, తొక్కే మోటారు సైకిలుకీ, తొడిగే బనీనుకీ—కూడా ప్రకటనలో అర్ధనగ్నంగా, వివశలైపోతూన్నట్టు అమ్మాయి బొమ్మలే వుంటాయి. ఏంతో కొంత యిలాంటి అసభ్యతలకి లోనుకాకుండా యీనాటి పిల్లలను పెంచటం — చాలా కష్టం. సరే యిదంతా బయట ప్రపంచపు వాతావరణం. కాని యింట్లో—మనం ఏపాటి సంప్రదాయాలని సృష్టిస్తున్నాం? అని కూడా ఆలోచించాలిగా? 'నాలుగుగోడల మధ్య తల్లి, తండ్రులమధ్య యింటి నడిబొడ్డులోనే ఈ రోజుల్లో పిల్లలు నాశనం అయిపోతున్నారు. ఇక వూరుమీద పడి ఏడవడం దేనికి?' అంటూ కసురుకుంటో సంఘ సేవిక. పిల్లలముందు మీరంతా ఎలా పోట్లాడుతారు! ఓక్షణం ఆలోచించారా? ఒట్లు వేస్తారు. శాపనార్థాలు పెడతారు. వ్యంగ్యం చేస్తారు. సత్యహరిశ్చంద్రుని కథ—చెప్తూనే అసత్యాలు ధారాళంగా వల్లిస్తూంటారు. మీ పిల్లాడే మీ మ్మల్ని ఓ పూట అదిగో అబద్ధం చెప్తావు — అని నిలదీస్తే తప్పేమిటో నా కర్ధంకాదు! మీ బాధంతా ఏప్పుడంటే—యిలా ఏ పెద్ద మనుషులముందేనా మీ పిల్లలు మీ పరువు తీస్తేను! అంతేనా?! కొందరంటారు — పిల్లలముందిలాంటి ప్రమాదంలేని తిట్లూ ఒట్లూ వడేస్తూ వుండడమే మంచిది—తరవాత్తరవాత—స్కూళ్ళల్లో కాలేజీల్లో పుస్తకాల్లో స్నేహితుల మధ్యవాళ్ళు వినే ప్రమాదకరమైన తిట్లూ ఒట్లూ బూతులూ వాళ్లకంత ఒంట పట్టవు అని. పిల్లలకి కనీసం పదేళ్లు వచ్చేదాకా నాలాంటివాళ్ళు చాలా జాగ్రత్తగానే వుంటారు. కనీసం 'డామ్' అనే ప్రమాదంలేని మాటకూడా అనేదాన్ని కాదు...కాని ఏంలాభం? ఆ వయస్సుకి వాళ్లు స్కూల్లో నేర్చుకున్న మాటలు వింటే— అలాంటివి వుంటాయని కూడ తెలియలేదు నాకు! ఒకోసారి మొండికేస్తూంటారు పిల్లలు. అలాంటి టైములో వాళ్లకేం దెయ్యం పడుతుందో తెలియదు. చివరికి అతి ముద్దుచేసి గారంచేసి నెత్తికెక్కించుకునే తల్లికి కూడా ఎత్తి కిటికీలోంచి అవతలికి పారేద్దా మనేటంత ప్రాణం విసిగిస్తారు పిల్లలు. ఏపని చేయకుండా వాళ్లని గొంతు చించుకుని అరవడమో తిట్టడమో చివరికి చెయ్యి చేసుకోడమో తప్పనిసరి చేస్తారు. అలాగే ఓసారి—నేనూ బండగా తిట్టేస్తే—చిన్నది కాస్త బిక్క మొహంతో నన్ను నిలబడిపోయింది. ఆక్షణంలో దాని ముఖంలో ఒకరకమైన హాయి కన్పించింది నాకు — 'మా అమ్మ కూడా మనిషే' అన్నట్టున్నాయి దాని చూపులు! అప్పణ్ణుంచీ యింత మొండి పేచీ ఏప్పుడూ తలెత్తలేదు మా మధ్య. యిలాంటివారికే పెదయ్యాక తోస్తుంది —తిట్టడం, ఒట్లువేయడం బూతులు మాట్లాడ్డం— ఏమంత ఘనకార్యం కాదనీ —పెద్ద తెలివీ కాదనీ.

పిల్లలని చుట్టూ వాతావరణం నుంచి రక్షించడం కష్టం. కాని ఆ వాతావరణం—దాని కాలుష్య ప్రభావం మనవాళ మీద మరీ బలంగా పడకుండా చూడ్డం కష్టం కాదు. మనచుట్టూ పుస్తకాలు, సంగీతం, బొమ్మలు, సినిమాలు యివన్నీ ఒక ఎత్తు —వీటిని యింటిలో పెద్దలు ఏ దృష్టితో చూస్తున్నారన్నది ఒకఎత్తు. నాకు తెలిసిన ఓ పెద్దమనిషి — వాపాగారి బొమ్మలు కూడా చూడనిచ్చేవాడు కాదు కూతుర్ని. ఏం ప్రయోజనం. ఆ అమ్మాయి మా యింటికి వచ్చి చదివేది! అట్టిచింపి పత్రికలు యిచ్చే తండ్రులు తెలుసు నాకు. కాని వాళ్ళు మటుకు పచ్చి సాహిత్యం రహస్యంగా దాచుకు చదువుతారు. బూతు సాహిత్యం, మనచుట్టూ వుంటే దాన్నుంచి పిల్లలని మనం రక్షించలేం, అంచేత వాళ్ల కళ్లకి గంతలనూ కట్టలేం. మనం చూడకపోతే, చదవకపోతే అది పోతుంది— అనుకోవడం భ్రమ, దొంగతనంగా అది ప్రవేశిస్తుంది. అంచేత ధైర్యంగా యింట్లోనే వాటి అసభ్యత అనండి, నిరుపయోగం అనండి, తెలియచేస్తే— మనలాగే కుర్రాళ్లూ వాటికి ప్రాముఖ్యం యివ్వరు. అందుకే— యింట్లో— సరైన దృక్పథం, వాతావరణం ఉండాలి అనడం... ఎందుకంటే — అక్కడే పసివాళ్ల విద్యాభ్యాసం ప్రారంభం అవుతుంది—అక్కడికి తిరిగి వస్తుంది కనక.

తల్లితండ్రులు అనుసరించని నీతి నియమాలు పిల్లలు అనుసరించాలని కట్టడి చేయడం దండుగ. పిల్లి కళ్లుమూసుకుని పాలు తాగినట్టు, లోకంలో సంబంధం లేకుండా పిల్లల్ని పెంచడమూ దండుగే— అందుకే ఆపలు సెన్సారు—యిల్లు. ●

# ఒక వారం విపరీతం

ఫాలాక్షుడు

## నూతిలో నిండు గర్భిణి

ధర్మపురి తాలుకా పెన్నాగడులో వెట్టియప్ప భార్య 19 ఏళ్ళ రాజమ్మ నిండు గర్భిణిట. పిట్ట గోడలేని నూతి చపటాలో కూర్చుని, ఆమె బట్టలన్నీ వుతికి, వాటిని ఆరేయడానికి దిగ్గున లేచిందట. ఆచపటా అంతా సబ్బు నురగతోవుండడం వల్ల కాలుజారి, సర్రున ఎగిరి నూతిలోపడి, సహాయం అందేలోగానే ఆమె చనిపోయిందట.

## నర్సుకోర్సు డాక్టరు :

ఎట్టియపురంలో మారియప్పన్ అనే అతని భార్య గర్భస్రావం కోసం నిర్మల అనే వో డాక్టరు వద్దకు వెళితే ఆమె ఏవేవో యింజక్షనులు చేసేసిందట. పర్యవసానంగా ఆమె పరిస్థితి ప్రమాద స్థితికి చేరే సరికి కోవిల్‌పట్టి ఆసుపత్రిలో చేరుస్తే ఫలితం లేక చనిపోయిందట. తన భార్య చావుకు




ఆ డాక్టరమ్మే కారణమని మారియప్ప పోలీసులకు ఫిర్యాదు చేస్తే వారు దర్యాప్తు కామె యింటికి వెళ్ళారట. ఇంటి బయట డాక్టరు నిర్మల, బి. యస్. సి. అని వుందట. విచారణద్వారా అసలామె యుస్పెల్సీయేనని తేలిందట. అంతేగాక, ఆమె అసలు పేరు వేలమ్మ అని ఏలూరులో నర్సుకోర్సు పూర్తి చేసిందనీ కూడా తేలిందట. పోలీసులామెను అరెస్టు చేశారు.

## దానకర్ణుడా, డాక్టరా?

కర్నూలు ప్రభుత్వ ఆసుపత్రిలో ఆర్థోపెడిక్ డాక్టరు మిడితల శివరామప్ప తన వార్డులోని వో రోగికి చాలా అర్జంటుగా తప్పని సరిగా శస్త్ర చికిత్స చేయవలసి వచ్చిందట. రోగి నిర్బలంగా వున్నందువల్ల అతని గ్రూపురక్తం అక్కడ దొరకనందు వల్లా, తనే తన రక్తాన్నోసీసాడు అతనికి దానం చేసి, ఆపరేషను దిగ్విజయంగా పూర్తి చేశాడట.

## భార్యహత్య, భర్త ఆత్మహత్య

బెంగుళూరు కుమార పార్కుకు చెందిన 40 ఏళ్ళ బసవరాజు అనే ఆయన 31వ తేదీవుదయం తనభార్య సన్నబోరమ్మను గునపంతో పొడిచి చంపి, తను మీదకి కిరసనాయిలు పోసుకుని నిప్పంటించు కున్నాడట. ఈయన బెంగుళూరు నీటిసరఫరా బోర్డులో జూనియర్ ఇంజనీరుట. ఆయన భార్య సన్న బోరమ్మ డాక్టరుట. ఈవిడ వాణి విలాస్ ఆసుపత్రిలో డాక్టరుగా వుంటూ యం. డి. పరీక్షకు చదువుతోందట. రోజూ ఆయన తన భార్యను స్కూటరు మీద ఆసుపత్రిలో దింపి, తాను ఆఫీసుకు వెళ్ళేవాడట. వీరిద్దరిదీ చక్కని ఆదర్శ దాంపత్యమనీ, వారిని చూసి ఆ అన్యోన్యత నేర్చుకోవాలనీ చుట్టు పక్కలవారు అనుకుంటూ వుండేవారుట

బసవరాజు తండ్రి ఆరోజు ఆసమయంలో బజారుకు వెళ్ళాడట. పని మనిషి కూరలు తేడానికి వెళ్ళిందట. వారబ్బాయి స్కూలుకు వెళ్ళాడట. ఆ ఎవరూ లేని సమయంచూసి బసవరాజు గునపంతో తన భార్య పొట్టలో ఒక్క పోటు పొడిచి, ఆమె రక్తపు మడుగులో విలవిలా తన్నుకోడం చూసి తను వో కంబళి కప్పుకుని, మీద కిరసనాయిలు పోసుకుని, నిప్పంటించుకున్నాడట. ఇంట్లోంచి లేచిన పొగ చూసి చుట్టుపక్కల వారు తలుపులు




పగలేసి యీ దారుణాన్ని చూసి, నిముషాలమీద వారిద్దరినీ విక్టోరియా ఆసుపత్రిలో చేర్చారట. సన్నబోరమ్మ మధ్యాహ్నానికి చనిపోతే, ఆమె భర్త సాయంకాలం వరకూ ప్రాణాలతో పోట్లాడాడట.

బసవరాజుకు తన భార్య నడవడిక మీద యిటీవల అనుమానం పుట్టిందని, అది రాను రాను ఎదిగిందని, యీ విషయంగా గత పదిహేను రోజులుగా భార్యా భర్తల మధ్య ఘర్షణ, కీచులాట జరుగుతూనే వుందని పోలీసు సేకరించిన విషయములలో తెలిసింది.

## పులితో చెలగాటం

మహేష్ దయాభాయ్ బారోట్ అనే 21 ఏళ్ళ బియస్సీ విద్యార్థి బరోడాలో సాయాజీభాగ్ జంతు ప్రదర్శనశాలకు ఆగస్టు 29వ తేదీ వుదయం 8—30 గంటలకు వెళ్ళి 35 అడుగులున్న వో పెద్దపులి బోనుకటకటాలు ఎక్కి లోపలకు దూకా




డట. చుట్టుపక్కలవారూ, జూ అధికారులూ గోల చేస్తే తనకు అంబాజీ (అమ్మవారు) మీద నమ్మకం వుందని, కనుక తనను పులి ఏమీ చేయ లేదనీ అన్నాడట. ఆ బోనులో భయంకరమైన బెంగాల్ పులుల మిధునం వుందట. అవి రెండూ అతని రాకకు ఆట్టే ప్రాముఖ్యత యివ్వక, తమపనిలో తాము వుండే సరికి అతను ఆ మగపులిని రెచ్చగొట్టి మీద మీదకు వెళ్ళి దాని కళ్ళల్లో వేళ్ళుపెట్టి పొడవ నారంభించాడట. ఆడపులి కిమ్మన కుండా కూర్చుందట. మగపులి మాత్రం కాస్సేపుచూసి, ఆనక గప్పున లేచి అతన్ని చంపేసిందట.

## చిత్రవధ

కడప జిల్లా కొండపేట గ్రామ మునసబు కె. సుబ్బారెడ్డి అనే ఆయనను ఎవరో కొంతమంది పట్టుకుని చంపేశారట. 25వ తేదీన ఆయను చెన్నూరు సమీపాన్ని వున్న పెన్నానది కాలిబాటలో నడుస్తుండగా, వో ఏడుగురెదురొచ్చి ఆయన్ని చిత్రవధచేసి, చంపేశారట. ఈ హత్యకు కారణం పోయిన పంచాయితీ ఎన్నికల సమయంలో పుట్టిన కక్షలట—పామర్తి.







## జరిగిన కథ

తల్లికి ఇష్టంలేకపోయినా ఎం. ఎ. లో చేరాడు విద్యార్థి. తన అన్నకూతురు లక్ష్మిని విద్యార్థి వివాహం చేసుకుని జీవితంలో స్థిరపడాలని ఆమె సంకల్పం. కాని, లక్ష్మి ఎవరినో ప్రేమిస్తున్నట్టు తెలుసుకున్న విద్యార్థి, మేనమామతో వాదం పెంచుకుని తిరిగి వచ్చేస్తాడు. మెడిసిన్ చదువుతున్న ఆనంద్ అతని రూమ్మేటు. అతని ద్వారానే సుందరి పరిచయమవుతుంది విద్యార్థికి. మామయ్య అప్పు తీర్చేటప్పటికి బాంకులో డబ్బు అయిపోయింది. ఇక ముందు చదువుగతి ఏమిటని విచారంలో మునిగిపోతాడు విద్యార్థి. గదిలో జరిగిన దొంగతనంవలన వేరే గది తీసుకుంటాడు. పిత్యం కద అతన్ని సొదుపరిగా మారుస్తుంది. ప్రైవేటుగా ఎం. ఏ. చదివే జ్ఞానాంబతో అతని పరిచయం పెరుగుతుంది. లక్ష్మి మోసపోయిందని తెలుస్తుంది. జ్ఞానాంబ విద్యార్థిని బాగా ఆకర్షించింది. అందుకే చనువు పెంచుకోసాగాడు. జ్ఞానాంబ ఆశయం విన్న విద్యార్థి ఆశ్చర్యపోయాడు. జ్ఞానాంబ మాటలతో విద్యార్థికి ధైర్యం వచ్చింది.

## 12

విద్యార్థికి ఒక్కసారిగా ఎక్కడలేని ధైర్యమూ వచ్చినట్లయింది. తన చెయ్యి పట్టుకుని లేవదీస్తున్న ఆ చెయ్యి అలాగే శాశ్వతంగా తనకు పూతనిస్తూ వుండిపోతే, తన సర్వస్వం పూచీనుండీ యిలాగే చేయూతనిచ్చి లేవదీస్తే ఎంత బాగుండు! ... ఈ చేతిని తనది చేసుకుంటే ... ఈ చేతి ఆసరాతో ఎంత దూరమైనా, ఎంత కంటకాన్వితమైన మార్గమైనా సుఖంగా నడవచ్చునన్న ధైర్యమూ కలిగింది ... మెత్తగావున్నా తనకు కొండంత బలాన్నిస్తున్న ఆ చేతిని ఒక్కసారి గుండెల కదముకోవాలన్న బలమైన కోరిక కూడా క్రొత్తగా కలిగిందతడిలో... ఆ కోరికను బలవంతానే అణిచేసుకుని, తనువు పులకరించగా తలెత్తి ఒకసారి జ్ఞానాంబ ముఖంలోకి చూచాడు... ఏలాంటి కలవరపాటూ లేకుండా పసిపిల్లలా స్వచ్ఛంగా నవ్వుతోంది జ్ఞానాంబ!

లేచి బట్టలు వేసుకున్నాడు... బయలుదేరబోతోంటే, 'ఇవిగోండి...లైబ్రరీ పుస్తకాలు...ఇవి యివ్వడానికి వచ్చాను' అంటూ యిచ్చింది.

'ఇవి యివ్వడానికి యింతదూరం రావాలా?... రేపు నేను వచ్చినప్పుడు తీసుకునేవాడినిగా...' అన్నాడు విద్యార్థి.

'అబ్బే కాదండీ ... గది వెతకడానికి బయలుదేరాను ... సరే దోవలోనేకదా ... అని పట్టుకొచ్చాను.'

'గది?! ... అదేమిటి మళ్ళీ మీకు ఏవరొస్తున్నారు?!'

'ఎవ్వరూ రావడం కాదండీ ... ఇంటివాళ్ళమ్మాయికి పెళ్ళి ... వాళ్ళు గది కావాలన్నారు... అందుకని...'

'మరి చూశారా ఎక్కడన్నా?'

'ఆ గదయితే దొరికింది ... గదికూడా కొంచెం పెద్దదే ... కానీ అద్దె కొంచెం ఎక్కువలా వుంది.'

'మరి ఏం చెయ్యాలనుకుంటున్నారు?'

'చేసేదేముంది? ... రేపు చేరుదామనుకుంటున్నాను. ఇంకొకళ్ళెవరన్నా కలిసొస్తే సరేసరి ... లేకపోతే కొన్నాళ్ళు చూస్తాను. మరీ భరించలేకపోతే అప్పుడే యింకో గది చూసుకుంటాను... మరి వాళ్ళ అవసరానికి ఖాళీ చెయ్యాలిగా...' అంది జ్ఞానాంబ.

'అయితే జ్ఞానాంబగారికి రూమ్మేటు వచ్చి కొత్త ఫ్రెండ్ దొరికితే నన్ను మర్చిపోతారు కాబోలు...' నవ్వుతూనే అన్నాడు విద్యార్థి.

'పోనీ మిమ్మల్ని మర్చిపోనివ్వకుండా చూసే ఫ్రెండ్‌నే తెచ్చిపెట్టండి రూమ్మేటుగా ... అయినా యివ్వాళేమో చిత్రంగా మాట్లాడతున్నారు విద్యార్థిగారూ...' అంది జ్ఞానాంబ అతడివైపు ఆశ్చర్యంగా చూసి... అంతలోకే రోడ్డుమలుపు వచ్చేసరికి, 'నేనిటువెళ్తాను ... మీరుకూడా వస్తారా?' అంది.

'నేనిటు పోవాలి లెండి...ఇల్లు చూడాలి... తప్పదని చెప్పారుగా నాకు ... వేట మొదలెట్టద్దూ' అన్నాడు.

'ఇది మరీ బాగుందండీ...నను వగలేమానేవారేమిటి?...' అంటూ నవ్వుతూనే వెళ్ళిపోయింది జ్ఞానాంబ.

ఇల్లు వెతుక్కుంటూ బయలుదేరిన విద్యార్థికి బ్రాడీపేటలో ఎక్కడా ఖాళీలు లేవు. అరండలుపేటకు వచ్చేసరికి జయలక్ష్మి జ్ఞాపకం వచ్చింది. తనకు తెలిస్తే చెబుతుంది గదా అని వాళ్ళయింటికి వచ్చాడు.

బయట తలుపులు తీసేవున్నాయి. సరాసరి లోపలకు వెళ్ళకుండా తలుపులమీద 'టక్‌టక్'మని కొట్టాడు మెల్లిగా.

'ఎవరూ?...' లోపలనుంచి ప్రశ్నతో బాటే వచ్చింది లక్ష్మి ... బాగా చిక్కిపోయింది...ఛాయకూడా తగ్గింది. బారెడు జడను వేలుముడిలా వేసుకుంది.

'ఓ!...నువ్వా బావా!... రా...' అంది.

లక్ష్మిని చూడగానే అతడికి తను చేసిన ప్రతిజ్ఞ జ్ఞాపకం వచ్చింది. పెట్టెలో అట్టడుగున పడేసిన మధూ ఫోటో, అతడి మెదడులో అట్టడుగున పడిపోయిన వాగ్దానం కూడా ఒక్కసారే గుర్తువచ్చాయి.

లక్ష్మి చూపించిన కుర్చీలో కూర్చుంటూ 'కులాసానా?' అని అడిగాడు.

'ఇదో...యిలా ... యిలా వున్నాను...' పేలవమైన నవ్వు నవ్వింది లక్ష్మి.

'ఎలా వుంది చదువు?'

'మానేశాను.'

'మానేశావూ!...అదేం పరీక్షలు వ్రా- వ్వులుగా ?!'

'పరీక్షలకు వెళ్ళటం లేదు.'

'పరీక్షకు వెళ్ళటంలేదా ? ... బాగుంది! మరేం చేస్తావ్ ?'

'ఉద్యోగం.'

'ఉద్యోగం!...అంటే మీ నాన్న తెచ్చిన ఏ డక్టరునో, ఇంజనీరునో పెళ్ళాడి, కార్లలో క్లబ్బులకూ, షికార్లకూ తిరిగే ఉద్యోగమా ?'

'కాదు ... ఒక ఇంగ్లీషు మీడియం స్కూల్లో వంద రూపాయల ఉద్యోగం... తర్వాత వీలుంటే 'కండొనేషన్' కట్టి ప్రైవేటుగా పరీక్షకు వెళ్దామనుకుంటున్నాను.'

'అదేం ... నీకూ మీ నాన్నలా డబ్బు పిచ్చి పట్టుకుందా?...మీ నాన్న ఎక్కడెక్కడి పాత బాకీలన్నీ వసూలు చేశాడుగా, నీకు 'రాజా' లాంటి సంబంధం తెస్తానని ?'

'ఆయన రాజాలాంటి సంబంధం తెచ్చారు...ఇంజనీరు తమ్ముడు ... అతడూ ఇంజనీరింగ్ చదివాడు ... ఏదో కాటేజి ఇండస్ట్రీ పెట్టించాలి అతడిచేతనని మా నాన్న అన్ని ప్రయత్నాలూ కూడా చేశారు.'



'మరి?...వాళ్లకు నచ్చలేదా?'

'అన్నీ అయిపోయి ... ముహూర్తాలు పెట్టుకోడందాకా వచ్చి ఆగిపోయింది.'

'ఆగిపోయిందీ!... ఏం ... దేనికు?... చివరేం చేశారు లక్ష్మీ...' చాలా ఆత్రుతగా అడిగాడు విద్యార్థి.

'ఎవ్వరూ ఏమీ చెయ్యలేదు బావా... నేనే చేసుకున్నాను ... అన్నీ నేనే చేసుకున్నాను. లగ్నాలు పెట్టుకోబోతుండగా అతడికి నా పరిస్థితినంతా తెలియజేస్తూ క్షమించగలిగితేనే వివాహం చేసుకోమని వుత్తరం వ్రాశాను.'

'లక్ష్మీ!...' విద్యార్థి స్వరంలో కంపన వినిపించింది...అతను నివ్వెరపోయి చూస్తున్నాడు లక్ష్మి ముఖంలోకి.

'అవును బావా ... నిజం...తెలిసో తెలియకో నా జీవితాన్ని నాశనం చేసుకున్నాను. ఇక తెలిసి తెలిసీ ... ఎన్నో ఆశలతో నన్ను స్వీకరించాలని అనుకున్నవాళ్ల జీవితంకూడా చెడగొట్టే హక్కు నాకెక్కడ వుంది?... అతడికి చెప్పకుండా చేసుకోడం వంచన కాదా బావా? అయితే ఆ వుత్తరం చూసి వాళ్ళు ఏదో సాకున యీ సంబంధం వద్దంటారని ఆశించాను నేను. కానీ అలా జరుగలేదు. లగ్నం పెట్టుకోడానికని నాన్నగారు వెళ్లినప్పుడు ఆయన మొహం మీదే అడిగి ఆ వుత్తరం చూపించారుట వాళ్ళు.

# విద్యార్థి

సిగ్గులేని మొహం పెట్టుకొని లగ్నాలు పెట్టుకుందామని వచ్చారని చాలా కఠినంగా మాట్లాడేరుట...'

అలా అంటుంటే లక్ష్మి కంఠం కొద్దిగా బొంగురుపోయింది. బరువుగా నిట్టూరుస్తూ—

'నాన్నగారికి నామీదున్న అపారమైన నమ్మకాన్ని అయినా నిలబెట్టుకోలేకపోయిన దౌర్భాగ్యురాల్ని బావా ... వాళ్ళమాటలు ఆయన నమ్మలేదు ... మా అమ్మాయి అలాంటిది కాదు...ఇది ఎవరో గిట్టనివాళ్ళు చేసినపని...రండి అమ్మాయిచేతనే చెప్పిస్తానని తీసుకువచ్చారు.

'నువ్వు చెప్పు బావా ... చేసినవన్నీ చేసి, తెగించి వుత్తరం వ్రాసి తీరా నేను వ్రాయలేదని ఆత్మవంచన చేసుకోనా? అంతకంటే— ముందుగా నోరు మూసుకు పెళ్ళి చేసుకున్నా న్యాయంగా వుండేదేమో...అందుకే నాన్నకు తలవంపులని తెలిసీకూడా నిజం చెప్పేశాను ... దానితో నాన్నగారు ఉగ్రులయ్యారు ... నువ్వు నా కూతురివేకావు పొమ్మన్నారు ... నీకూ నాకూ యిక ఏమీ సంబంధమూ లేదు. బయటకు నడవమన్నారు... వచ్చేశాను.

'అమ్మ ఏడ్చింది ... నన్ను బతిమిలాడింది; నాన్నకాళ్ళు పట్టుకోబోయింది: కానీ నేనే వుండలేదు ... అవును. కన్నతల్లి తండ్రికోసం, వాళ్ళ ముద్దుముచ్చట్లు వాళ్ళ కోరికలూ ఆశలూ తీర్చడానికి నేను ఏం త్యాగం చేశాను. గనుక నాకోసం వాళ్ళ పరువును త్యాగం చెయ్యమని అడిగే హక్కుంది నాకు?...కూతురిపట్ల తండ్రికి కొన్ని బాధ్యతలున్నట్లే తండ్రిపట్ల కూతురికి కూడా కొన్ని బాధ్యతలున్నాయి కదా. నా బాధ్యత నేను నెరవేర్చలేదు. అందుకే నానీడకూడా వాళ్ళమీద పడనివ్వదల్చుకోలేదు నేను.'

విద్యార్థి ఆశ్చర్యంతో వింటున్నాడు ... తన కళ్ళముందే మానసికంగా లక్ష్మి యింత ఎత్తు ఎదిగిపోతే వింతగా చూస్తున్నాడతడు.

'బావా! ... నాకొక్క సాయం చెయ్యగలవా?' చెమర్చినకళ్ళు తుడుచుకుంటూ అంది లక్ష్మి.

'ఎప్పుడో చెప్పానుగా లక్ష్మీ—నిస్సంకోచంగా చెప్పు చేస్తాను.'

'అయితే నాకోగది చూసి పెట్టగలవా?'

'ఓ గాడ్! ... నిన్నూ ఖాళీ చెయ్యమన్నారా మీ యింటివాళ్ళు?'

'ఎవ్వరూ ఏమీ అనలేదు ... కాని నేనే చేద్దామనుకుంటున్నాను. నాకు యిక్కడ వుండాలనిపించటం లేదు.'

విద్యార్థికి వెంటనే జ్ఞానాంబ స్ఫురణకొచ్చింది.

'వేరుగా గది కావాలా? ... ఎవరితోనయినా కలిసి వున్నా ఫర్వాలేదా?'

'కొంచెం కలుపుగోలుగావుండే వాళ్ళయితే యింకోళ్ళున్నా, ఫరవాలేదు. ఏం బావా మీ క్లాస్‌మేట్ ఎవరన్నా యిస్తామన్నారా?'

'ఆఁ క్లాస్‌మేట్... అహా... క్లాస్‌మేట్ కాదు ... అదేలే క్లాస్‌మేట్టే అనుకో...' తడబడుతున్న విద్యార్థి మాటను తుంచేసి,

'ఎవరయితేనేంలే...ఉండు...రెండు నిముషాలు కూచో... ఇప్పుడే వెళ్ళి మాట్లాడుదాం' అంటూ లేచింది లక్ష్మి.

'ఇప్పుడేనా?'

'ఆలస్యమెందుకు బావా ... అయినది రెండే నిముషాలు...' అంటూ లోపలకు వెళ్లి గబగబా నాలుగు పాయలు జడల్లేసి చీర మార్చుకుని వచ్చింది.



'మాడు యిప్పటికే అరున్నర కావస్తోంది...అక్కడికి చేరేసరికి ఏడు ... ఈ వేళప్పుడు వెళ్ళేకంటే రేపు పగలు వెళితే గది చూడచ్చుగా ?'

తయారయి వచ్చిన లక్ష్మితో అన్నాడు విద్యార్థి.

'గది చూడాల్సిన ప్రసక్తే లేదు బావా. చూడదల్చుకుంది ఆమెను. మాట్లాడదల్చుకుంది ఆమెతో...ఆమెకు నచ్చితే గది ఎలా వున్నా ఫరవాలేదు...పద బావా.'

'ఇంటర్వ్యూ పెడతానన్న మాట!...కొంపదీసి వుద్యోగ మిద్దామనుకుంటున్నావా ఏం ?'

కొద్ది క్షణాలు మౌనంగావుండి, తర్వాత కిటికీలోంచి చూస్తూ, 'గత కొద్దిరోజుల నుండీ ప్రపంచాన్ని గురించి ఎంత తెల్సుకున్నానో నీకు తెలియదు బావా...నేను కాలేజీలో చేరిన కొత్తల్లో...ఒక ధనవంతుని కూతురుగా నాకెంత గౌరవమిచ్చారో ...నా స్నేహంకోసం ఎంత పాకులాడేవాళ్ళో నాకు తెలుసు... గాడి తప్పి నేను అతనితో స్నేహంగా తిరుగుతున్నప్పుడు కూడా నా వెనుక ఏమనేవారో కానీ, నా ముందు ఏన్నెత్తుమాట అనలేదు. కనీసం యిది తప్పని గూడా హెచ్చరించలేదు సరికదా... పైగా 'అదృష్టవంతురాలివి' అని పొగిడారు ...తీరా యిప్పుడు...అడుగు వేసింది అడుసులోనని తెలిశాక...నా ముందే గుసగుసలు, మూతి విరుపులు, సూటీ పోటీ మాటలు ...హుఁ ... యిది బావా స్నేహితులమని చెప్పుకుంటూ తిరిగిన కొంతమంది నిజ స్వరూపం...' అంది...ఆ స్వరంలో బాధ భరితమైన ఆవేశం వుంది ... కిటికీలోంచి చూస్తున్నదల్లా ఒక్కసారి తిరిగి అతడి మొఖంలోకి చూస్తూ,

'ఈ చెడిపోయినదాన్ని వెంటేసుకు తీసుకెళ్ళడం నీ కష్టంగా నామోషీ అయితే చెప్పు బావా...ఆగను.' అంది.

'లక్ష్మీ!...' ఇంచుమించు అరిచినట్లే అన్నాడు విద్యార్థి.

లక్ష్మి కృతజ్ఞతాపూర్వకంగా చూసింది అతడి వైపు...తామరరేకుల మీంచి జారిపడే తుషార బిందువుల్లా, లక్ష్మి కన్నుల్లోనుండీ రెండు మూడు నీటిచుక్కలు జారి ఆమె చెక్కిళ్ళమీద పడ్డాయి.

'మంచితనం నిండివున్నవాడివి యింత

దాకా నిన్నొక్కడినే చూశాను బావా...'

అని, 'సరే యీ కబుర్లకేం గానీ...ఇం క పోదాం చీకటి పడింది.' అంటూనే లేచింది.

* * *

జ్ఞానాంబ అప్పటికే సామాను చాలా మటుకూ సర్దేసింది... అలమారులో పుస్తకాలు తీస్తోంది పెట్లో సర్దడానికి... వీళ్లిద్దర్నీ చూడగానే లేచి సాదరంగా ఆహ్వానించింది. విద్యార్థి తన 'పేటెంటు కుర్చీ'లోనే కూర్చున్నాడు. లక్ష్మికి చాప వేసింది... లక్ష్మిని పరిచయం చేశాడు విద్యార్థి...గదికోసం వచ్చినట్లు ముందుగా చెప్పవద్దని లక్ష్మి చెప్పినందువల్ల ఆ విషయం చెప్పలేదు. మామూలు మాటలు సాగుతూనే వున్నాయి. జ్ఞానాంబ బక్కెట్‌లో సర్దేసిన సామాను తీసి, స్టౌ అంటించి కాఫీనీళ్లు పడేసింది.

'అయితే మేము వద్దన్నా వినకుండా యీవేళప్పుడు మీరు కాఫీ పెడుతున్నారు కాబట్టి, మీ పనిలో నేను సాయం చేసి పెడ్తానుండండి.' అంటూ లక్ష్మి వెళ్ళి పుస్తకాలు సర్దడం మొదలు పెట్టింది.

'సాయం!...వద్దండి...ఈ జ్ఞానాంబకు సాయం చేద్దామనుకున్న వాళ్లెవ్వరూ యింతదాకా సుఖపడలేదు. బాగుపడలేదు... దయవేసి నా మాట వినండి.' డికాషన్ వేస్తూ అంది జ్ఞానాంబ నవ్వుతూ.

# విద్యార్థి

'ఏమండీ...యీ జయలక్ష్మి సాయం చేద్దామనుకున్న వాళ్లూ, చేసిన వాళ్లూ యింతదాకా చెడిపోయినవాళ్ళు ఎవరూ లేరు. దిగులు పడకండి.' నవ్వుతూనే జవాబిచ్చింది లక్ష్మి. యింకా అలమారలో పుస్తకాలు తీసి బొత్తిగా పెడతూనే,

'మంచివారే!...' గల గలా స్నేహామృతం వర్షించినట్లు నవ్వుతూ కాఫీ కలుపుతోంది జ్ఞానాంబ.

పుస్తకాలు సర్దుతున్నల్లా ఒక పుస్తకం చూసి చప్పున ఆగిపోయి, ఆ పుస్తకం యివతలికి తీస్తూ, 'యిది మీరు చదివారాండీ?' అని అడిగింది లక్ష్మి.

'ఆఁ చదివాను.' అంది జ్ఞానాంబ డికాషన్ వడియగడుతూ.

'అయితే నచ్చిందా మీకు?'

'నాకెలా నచ్చుతుందనుకున్నారు లక్ష్మిగారూ!...విద్యార్థిగారు మీ బంధువన్నారు. ఆయన నా గురించి ఎప్పుడో చెప్పేసి వుంటారే...నాకు ప్రేమా పెళ్ళి వగైరాలంటే గిట్టవని, నా గుండె గుండె కాదు. అది ఒక బండరాయనీ...' యింకా నవ్వుతూనే అంది జ్ఞానాంబ.

'జ్ఞానాంబగారూ ... మీరంటున్నదానికి నేను 'ప్రొటెస్టు' పెడుతున్నాను. ఒకటి—మీమీద లేనిపోనివి, కావల్సిన వాళ్ళతో, అక్కర్లేనివాళ్ళతో చెప్పడమే నా పని అనుకున్నారా?...రెండోది...' అని కాస్సేపాగాడు విద్యార్థి... ఈసారి అతడి స్వరంలో అతడికి తెలియకుండానే మృదుత్వం వచ్చేసింది.

'రెండోది...మీకు ప్రేమా పెళ్ళి అంటే గిట్టదని మీరనుకుంటున్నారేమో కాని నేననుకోవటం లేదు. మీ గుండె బండరాయి అని మిమ్మల్ని మీరు మభ్యపెట్టుకోవాలనుకుంటున్నారేమో కానీ...నేను నమ్మను. ప్రతిహృదయం సవరాగలూ పలికే ఒక విపంచి ... ఆ వీణను పలికించే వైణికుడు దొరికిన క్షణాన అది మధురగానం వినిపిస్తుంది. అయితే పరిస్థితులు కలిసిరాక వైణికుడు ఆలస్యంగా జీవితంలో ప్రవేశించడం జరిగితే జరుగుతుందేమో ... కానీ...'

'బాబోయ్ ... ఈ వీణను చూసి పలికిస్తామని సాహసం చేసేవాళ్ళెవరండీ?' కాఫీగ్లాసు అందిస్తూ అంది జ్ఞానాంబ...

'రాగాలు పలికించాలని వచ్చిన వైణికుడెవరూ... వీణ అందాన్ని చూసి రాడండీ... అతడికి కావల్సింది- నాదం కానీ రూపం కాదు.' తలవంచుకునే కాఫీగ్లాసు అందుకుంటూ అన్నాడు.

'అయితే అలాంటివాడు యిహ ముందు పుట్టాలి' అంది జ్ఞానాంబ మళ్ళీ నవ్వుతూ.

ఆ క్షణంలో ఇద్దర్నీ దగ్గరగా చూసిన లక్ష్మి ముఖంలో అది సంతోషమా దుఃఖమో ఆమెకే తెలియని ఒక భావం కదిలీ కదలనట్లు కదిలి అంతలో మాయమయింది.

'అదేమిటండీ అలా అంటారు జ్ఞానాంబగారూ...మా బావ అంతయిదిగా మాట్లాడుతున్నాడంటే, ఆ వైణికుణ్ణి ఎవణ్ణో వెతికే వుంటాడేమో...' లక్ష్మి కలుగచేసుకుంది.

'హతోస్మి!... అయితే ...ఐ పిటీ దట్ పూర్ మాన్...' అంది జ్ఞానాంబ లక్ష్మికి మరో గ్లాసు అందిస్తూ.

'బాగుంది మీరు దుర్భాగ్యుడనుకుంటున్నవాడే అంతటి అదృష్టవంతుడు లేడనుకోవచ్చు గదా?...' అంది లక్ష్మి.

విద్యార్థి కాఫీ కొద్ది కొద్దిగా చప్పరిస్తూ ఫ్లోర్ మీదకు చూస్తున్నాడు.



విద్యార్థి పరిస్థితి గమనించిన లక్ష్మి మాట మారుస్తూ, 'ఇంతకూ నవల సంగతి చెప్పకుండానే యింకో టాపిక్‌లోకి వెళ్ళిపోయ్యారు... ఇద్దరు యువతీ యువకులు తటస్థపడ్డప్పుడు పరస్పరాకర్షితులవడం సహజమే గదా?' అంది.

'ఆకర్షణ సహజమే. కానీ ఆకర్షణ రెండువైపులా పదునున్న కత్తిలాంటిది... దాన్ని వుపయోగించేటప్పుడు చాలా జాగ్రత్తగా మసులుకోవాలి. ఆకర్షించగలగటం అనేది స్త్రీకి ఒక వరం. ఆ వరాన్ని బహు తెలివిగా వాడుకుని పురుషుని తన గుప్పిటలో పెట్టుకోవాలి. అలా కాక తనే నిగ్రహం కోల్పోయి ఏ బలహీన క్షణానో పొరబాటు జరిగితే తనే అతడి గుప్పిటలో చిక్కుకున్నప్పుడు స్త్రీకున్న అపురూపమైన వరం కాస్తా భస్మాసుర హస్తమయి కాల్చేస్తుంది.'

'అవును... అలా భస్మాసురహస్తం కాల్చి మసి చేసినప్పుడు చూసి ఆనందించేవాళ్ళు తప్ప సానుభూతి చూపేవాళ్ళు కూడా లేరు యీ దౌర్భాగ్యపు భారతదేశంలో?...' పుస్తకం కేసి చూస్తూ అంది లక్ష్మి స్వగతంలా.

జ్ఞానాంబ నవ్వింది.

'అది కాదండీ ... కాల్చేసింది మన పొరపాటే అయినప్పుడు... ఎవరో సానుభూతి చూపించాలని ఆశించడం, చూపించలేదని బాధపడడం సబబేనా లక్ష్మిగారూ? అంతకంటె దేశాన్ని దుయ్యబట్టటంలో అర్థమేమున్నా వుందా? ... ఈ దేశాన్ని దౌర్భాగ్యపు దేశంగా వుంచడంగానీ, స్వర్గతుల్యంగా మార్చడంగానీ మనచేతిలో వుంది... ఈ దేశంలో పుట్టి పెరుగుతున్న మనుషుల చేతుల్లో వుంది... అది గ్రహించి, తన శక్తికొలదీ ఈ దేశం బాగుపడడానికి ప్రయత్నం చెయ్యాలిగానీ... ఒకసారి దేశాన్ని నిందించి తాను తప్పుకోమాడ్డం ఏస్కేపిజం కాదంటారా?' అంది.

ఈ మాటి ప్రశ్నకు నిముషంసేపు జవాబు చెప్పలేదు లక్ష్మి. విద్యార్థి చూపు లోత్తుమించి మళ్ళించి. ఆసక్తితో వింటున్నాడు వాళ్ళ సంభాషణను.

'క్షమించాలి... మీకు కష్టం కలిగించాలని నా వుద్దేశం కాదు. చాలామంది అలా దేశాన్ని దుయ్యబట్టి తప్పుకోవాలని చూస్తుంటారు. అందుకని జనరల్‌గా అన్నాను... సారీ...' అంది జ్ఞానాంబ నొచ్చుకుంటూ.

'మీరు నాకేమీ కష్టం కలిగించలేదు జ్ఞానాంబగారూ... నేను ఆలోచించేట్టు చేస్తున్నారు... అంతే... మీ వాదం నా కర్థమైంది... తప్పు చేసినప్పుడు క్షమించడం, క్షమించకపోవడం అవతలివారి ఔదార్యంమీదే ఆధారపడి వుంటుంది... అది చూపించలేదని బాధపడడంకంటె, చేసిన తప్పుకు శిక్ష ఆనందంగా అనుభవించాలన్న మీ వాదం నేనొప్పుకుంటున్నాను... సరే... ఇక నవలకొద్దాం.

# అశ్వమేధం కంటేనూ అహింసయే గొప్పది



బులుసు వెంకటరమణయ్య — ధర్మపథం

యుద్ధంలో జ్ఞాతివధ జరిగినందున ధర్మరాజు మనస్సు ఎంతో దుఃఖపడింది. ఎన్నో పాతకాలు చుట్టుకున్నాయి. అప్పుడు అతని మనస్సు శాంతిని పొందడానికిన్నీ, పాపపరిహారార్థమున్నూ అశ్వమేధయాగం చెయ్యవలసినదని వ్యాసమహర్షి హితాన్ని ఉపదేశించాడు. వెంటనే ధర్మజుడు సర్వసన్నాహాలూ చేసి, అశ్వమేధయాగాన్ని ఎంతో ఘనంగా చేసి, ఈ విధంగా ఇదివర కెవ్వరూ చెయ్యలేదని గొప్ప ఖ్యాతి సంపాదించాడు.

ఆ యాగాన్ని అందరూ పొగడుతున్న సమయంలో ఒకే ఒక ముంగిస ఒక కన్నం నుండి బయటకు వచ్చి 'మీరిలా పొగడుతున్నారు కాని, సక్తుప్రస్థుని ధర్మంతో ఈ గొప్ప యాగం సరిపోదు' అంటూ, అక్కడివారు ఆశ్చర్యపడగా ఇలా చెప్పింది.

'కురుక్షేత్రంలో సక్తుప్రస్థుడనే బ్రాహ్మణుడు కళ్ళాలలో గింజలు ఏరుకుని జీవించే ఉంఛవృత్తితో కాలం గడిపేవాడు. అతని కుటుంబం నలుగురు — తాను, భార్య, కొడుకు, కోడలున్నూ. ఒకప్పుడు కరవువల్ల పంటలు లేక జీవనమే కష్టమైపోయిందతనికి. ఉపవాసాలతోనే రోజులు గడిచేవి. ఒకరోజు కొంత పేలపిండి దొరికింది. దాన్ని కుటుంబంలోని నలుగురూ సమంగా పంచుకుని తినాలనుకున్న సమయంలో ఒక అతిథి వచ్చాడు. అతన్ని తృప్తిపరచడానికి క్రమంగా ఆ నలుగురూ తమ తమ వంతు సక్తువును ఇవ్వవలసి వచ్చింది. ఆ అతిథి యముడు కాని, సామాన్యుడు కాదు. బ్రాహ్మణుని ధర్మాన్ని మెచ్చుకుని, తన లోకానికి రావాలని విమానాన్ని పంపించాడు. ఆ విమానాన్నెక్కి ఆ నలుగురూ వెళ్ళిపోయారు. నేను నా కన్నంనుంచి బయటికి వచ్చి ఇదంతా చూశాను. ఆ పేలపిండి సువాసన, అతిథి పాదోదకపు తడి, నా తలకు ఒక పార్శ్వం అంటినందువల్ల ఆ భాగం బంగారుమయమైనది. రెండవవైపు కూడా స్వర్ణమయం కావడానికి ఎంతో యత్నించాను; లాభం లేకపోయింది. ఈ యాగంవల్లనైనా నా కోరిక నెరవేరుతుందేమో అని అనుకున్నాను. ప్రయోజనం లేకపోయింది. అందుచేతనే ఈ మహాయాగం ఆ బ్రాహ్మణుని ధర్మంతో పోటీ కాదని అన్నాను.' ఇలా అంటూ ఆ నకులం వెళ్ళిపోయింది.

దానిమాటకు అందరూ ఆశ్చర్యపోయారు. ఈ యాగం ఎందుచేత గొప్పది కాలేదో ఎవ్వరికీ బోధపడలేదు. అదెందుకు గొప్పది కాలేదో వైశంపాయనుడు గ్రహించి, జనమేజయుడితో ఇలా చెప్పాడు — 'అశ్వమేధయాగమేమో చాలా గొప్పదే! కాని అందులో పశుహింస ఉన్నది. హింసాత్మకమైన యజ్ఞయాగాదులకంటె హింస లేని తపోయజ్ఞం ఎంతో గొప్పది. అహింసాత్మకమైన తపస్సు చెయ్యడం వల్లనే సక్తుప్రస్థుని ధర్మం ధర్మరాజు చేసిన అశ్వమేధయాగం కంటే కూడా ఎంతో గొప్పదయింది' అని. ●

# విద్యార్థి

...ఆ అమ్మాయి అతన్ని ప్రేమించింది... ప్రేమించినవాడికి తన సర్వస్వం అర్పించింది...అలా అర్పించడం తప్పంటారా ?'

'క్షమించాలి ... ప్రేమించడం తప్పని నేననటంలేదు లక్ష్మిగారూ...మోహాన్ని చూచి ఒక్కోసారి ప్రేమ అని భ్రమపడుతున్నారన్నాను ... ఇక రెండోది మనసారా ప్రేమించినవాడికి 'సర్వస్వం' అర్పించటంలో తప్పు లేదు. విటొచ్చి అది అపాత్రదానం కాకుండా చూసుకోవాలి...మనుషుల్లో తారతమ్యాలు వుంటనిగదా లక్ష్మిగారూ... నోటివాట మీద వేలరూపాయలు అప్పులివ్వదగ్గవాళ్ళూ వుంటారు ... ప్రోనోటు రాయించుకొందే అప్పులివ్వగూడని వాళ్ళూ వుంటారు ... ఇదీ అంతే...అయితే యీ తారతమ్యాలు తెలుసుకోడానికి కొంత వయస్సూ కొంత అనుభవమూకూడా కావాలి.

'ఇంకోటి. నిజంగనే ప్రేమించి తన సర్వస్వం అర్పించి, ఆ తర్వాత ఏదైనా విషమపరిస్థితులు యెదురైతే నిలదొక్కుకోగల మనస్థైర్యం వున్నవాళ్ళు కొద్దిమందే ...అందుకనే పెళ్ళి అనే సంకెళ్ళు తగిలించడం. పెళ్ళి స్త్రీకి ఒక 'సోషల్ సెక్యూరిటీ' ఒక సాంఘిక భద్రత నిస్తుంది... పూలసంకెళ్ళులా కనిపించినా, నిజానికి పెళ్ళి పురుషుని స్వాతంత్ర్యానికి యిందుమించు యినుపసంకెళ్ళు తగిలిస్తుంది ... అందుకే స్త్రీలు కొంత మనోనిగ్రహంతో వ్యవహరించాలి...కానీ... యీ నవలలన్ని యిచూడండి . . ; వీటిని వయోభేదం లేకుండా అందరూ చదువుతారు ...ముఖ్యంగా కన్నెపిల్లలు చిన్నపిల్లలు, లోకంపోకడ తెలిసీ తెలియనివాళ్ళు ఎక్కువగా చదువుతుంటారు ... వాళ్ళను అనవసరంగా తప్పుదోవ పట్టించడం, వాళ్ళను దృష్టిలో పెట్టుకోని ... కేవలం ఆవేశం కలిగించే విధంగా కాక, ఆలోచనలు రేకెత్తించే విధంగా వుంటే బాగుంటుందని... సూచించాను ... అంతే..'. అన్నది జ్ఞానాంబ.

'మీరు చెప్పిందికూడా నిజమే ... స్త్రీకి ప్రకృతికూడా శత్రువే ...కానీ అవివాహితులైన తల్లులకు వేరే రక్షణగృహాలు వుంటే పరిస్థితి యింత అధ్వాన్నంగ వుండదేమో?'

'అవును యింత భయంకరంగా వుండదేమో పరిస్థితి...కానీ...తల్లితండ్రి బిడ్డకిచ్చేది ఒక్క అన్నవస్త్రాలేనంటారా ? ... ఒక విత్తునాటితే అది మొక్కగా పెరగడానికి చాలా అనుకూలపరిస్థితులు కావాలి... అలాగే ఒక బిడ్డ నార్మల్‌గా డెవలప్ అవడానికి, సమాజానికి పనికివచ్చే ఒక ఉత్తమ పౌరుడిగా తయారవడానికి కావల్సిన పరిస్థితులు చాలా వున్నయి... ముఖ్యంగా ఒక 'సెన్స్ ఆఫ్ బిలాంగింగ్‌నెస్' 'ఈయింటికి దీపం నేను ..యీ కంటికి వెలుగును నేను' అన్నభావం బిడ్డకు కావల్సిన ఆత్మవిశ్వాసాన్నిస్తుంది...తన బాధ్యతలు గ్రహించి వారి నీడలో తనూ ఒక బాధ్యతాయుతమైన పౌరుడుగా తీర్చిదిద్దబడతాడు ... లక్ష్మిగారూ...నా భావాలు మీకు బూజుపట్టిన భావాల్లా కన్పిస్తున్నయికదూ...' అంటున్న జ్ఞానాంబ మాటకు అడ్డువచ్చి,

'జ్ఞానాంబగారూ... మీకే గనుక ఒక కాలు జారినపిల్ల తటస్థపడితే అసహ్యించుకుంటారా?' వున్నట్టుండి ప్రశ్నించింది లక్ష్మి.

'భలే ప్రశ్నలేరండీ!... ఆశయాలూ, అభిప్రాయాలూ, ఆచరణలో కన్పించాల్సినవి... కేవలం మాటల్లో చెబితే చాలంటారా ?... ఓ దగాపడ్డ అమ్మాయి కన్పించినప్పుడు నా ప్రవర్తన చూసి అప్పుడు అంచనావేసుకోండి నన్నుగురించి...' అంది జ్ఞానాంబ కాఫీ గ్లాసులు కడిగిపెడుతూ.

'దగాపడ్డ అమ్మాయిని చూసినప్పుడు...' మనసులో గొణుక్కున్నట్టుగా అన్న లక్ష్మి చటుక్కున తలెత్తి జ్ఞానాంబ కళ్ళల్లోకి చూస్తూ, 'అలాంటి అమ్మాయికోసం ఎక్కడికో పోనక్కరలేదు...నేను వున్నాను.' అంది.

'జయలక్ష్మిగారూ' ... బిత్తరపోతూ అంది జ్ఞానాంబ.

'అబద్ధంకాదు జ్ఞానాంబగారూ... నిజం ...వచ్చి నిజం...నేనే ఒక దగాపడ్డ అమ్మాయిని...తెల్లనివన్నీ పాలే అనుకొని మురిసిపోయి భ్రమపడ్డాను...కానీ ఒక్కటిమాత్రం నన్ను బాధపెడుతోంది... ఆనాడు నేను భ్రమలోపడి కొట్టుకుపోతున్నప్పుడు, కనీసం యిది తప్పనికూడా హెచ్చరించని వాళ్ళు యీరోజు నన్ను చూసి అసహ్యించుకుంటున్నారు... నా నీడ పడితేనే మైలపడతామన్నట్టు తప్పుకు తిరుగుతున్నారు...ఇప్పుడు చెప్పండి జ్ఞానాంబగారూ ...'నాకు మీరు ఆశ్రయం యివ్వగలరా? ... మీ గదిలో నన్నుకూడా వుండనిస్తారా?' ఆర్థికంగా మీరు నాకేవిధమైన సహాయమూ చెయ్యనక్కరలేదు. నందరూపాయలు తెచ్చుకుంటాను...సమద్దె భరిస్తాను. మీరు చెయ్యవలసిందల్లా యీ నచ్చినపామును మళ్ళీమళ్ళీ చంపకుండావుంటే..' లక్ష్మి కంఠం రుద్ధమైంది ... కళ్ళు అశ్రుసిక్తాలైనాయి.

విద్యార్థి వులిక్కిపడిలేచాడు ... లక్ష్మి కుండలు బద్దలుకొట్టినట్టు యిలా చెబుతుందనుకోలేదతడు... అమాంతం వెళ్ళి లక్ష్మి నోరు మూక్కేయాలనుకున్నాడు.

(ఇంకా వుంది)



# ఆడవాళ్ళని అర్థం చేసుకొందాం

**— లలీప్రుమెత్ —**

ఇదివరకే ఎవరో ఒకరు చెప్పనిదీ, మన మహిళలకు తమ్ము గురించి తెలియనిదీ ఇప్పుడు కొత్తగా చెప్పడానికేంలేదు. ఇంక మనం చేయగలదల్లా మన మగవాళ్ళు పత్రిక తెరిచేసరికి మహిళ ఎంత అద్భుతసృష్టో, దివ్యసృష్టో జ్ఞాపకం వచ్చేలా చెయ్యడమే.

మహిళ తన చేతిలోంచి గ్లాసు జారి కిందపడి ముక్కలు ముక్కలయిపోతే అదో శుభసూచకంగా భావిస్తుంది. కాని, అదే మగవాడి చేతిలో జరిగితే ఆ మగడు ఏమీ సర్గ్గా చెయ్యలేని వట్టి చవటబుర్ర అయిపోతాడు.

'కట్టుకొనేందుకేమీ లేద'నడం ఆడవాళ్ళకో అలవాటు. బ్రిటిష్ మహారాజ్ఞి ఒకసారే తప్పుపట్టింది. దేశానికి కష్ట దినాలు వచ్చి పౌను విలువ తగ్గించిన సందర్భంలో ఆమె ఎంతో దేశభక్తి ప్రదర్శించారు. స్వార్థరాహిత్యం ప్రదర్శించారు. తన దుస్తులమీద చేసే ఖర్చు తగ్గించి, పరిమిత పరచుకొన్నారు. దీని ఫలితంగా ఆమె ఒక్కొక్క డ్రెస్సును రెండోమారు కూడా కట్టుకోవలసి వచ్చిందని బ్రిటిష్ పత్రికలు వ్రాసేయి.

ఇలాంటి త్యాగాలు మగవాళ్ళకి అర్థం కావు. ఏ మనుష్యకీ దానికున్న ప్రాధాన్యత వారికి అర్థంకావు.

'ఏమీ: బాగా మారిపోయేవు సుమా. ఏమిటా దుస్తులు అసహ్యంగా, మన పెళ్ళయిన కొత్తలోనే ఎంతో బాగా వుండేవాడివి' అంది భర్తతో ఆమె.

'అసంభవం' అన్నాడు మగడు దిగ్భ్రమగా, 'మన పెళ్లినాడు నే వేసుకొన్నదిదే సూటు.'

ఆడవాళ్ళని గురించి మగవాళ్ళు అనుకొంటూండే మాటలు కొన్ని మీకు చెప్తా.

'మంచి భార్య వెలలేని రత్నంలాంటిది. అటువంటివాళ్లు దొరకడం చాల అరుదు.'

నిజాన్ని నిరూపించడంకోసం ఆడుది ఎప్పుడూ తగవు పెట్టుకోదు నెగ్గేవారి పక్షాన వుండడం వాళ్లదృష్టిలో అతి ముఖ్యం.

తమకక్కర్లేని విషయాలు ఆడవాళ్లకి కటిక చీకట్లో కూడా కనిపిస్తాయి.

కుటుంబ నిర్వహణలో భర్తలకు భార్యలు సాయంచేసే అవకాశం కలిగించేందుకే మగవాళ్ళు సుహృదాశయంగా తక్కువ జీతాలిచ్చే ఉద్యోగాల్ని వాళ్ళకోసం వదిలి పెట్టేరు.

గాలిలేకపోతే పడవలూ, ఆడవాళ్ళు లేకపోతే మగవాళ్లూ అట్టే దూరం వెళ్లరు.

ఆడవాళ్ల అత్యద్భుత తర్కం వినడానికి సుహసరసంగా వుంటుంది.

ఒకమారు ఒక పడుచు కొత్త హేట్ ఒకటి కొనుక్కోవాలనుకొంటున్నానని మగడితో చెప్పింది. 'మళ్ళీనా...ఇప్పుడు నీకున్నది మంచిగానే వుందే!' అన్నాడు మగడు ఆశ్చర్యంగా. (వాళ్లెప్పుడూ అలాగే అంటారు.)

ఆవేళ మధ్యాహ్నం ఆమె తిరిగివచ్చి, ఏ హేట్ కొనాలో తేల్చుకోవడం మహా కష్టమయి పోయిందంది:

'తెల్లనీ, నీలివీ కూడ ఎంత బాగున్నాయని! ఏది తీసుకోడమో తేల్చుకోలేకపోయాను.'

'చివరాఖరికి ఏది కొన్నావు?'

'ఆఖరుకి తెల్లటిదే కొన్నా. నీలిదొకటి తీసుకొన్నా' నందామె.

ఆడవాళ్ళు నేరుకులెందుకు కొంటూంటారాయని ఒక సమాజ శాస్త్రజ్ఞుడు కారణాలు అన్వేషించసాగేడు. మిగిలిన ఆడవాళ్లు కొంటారు గనకనీ, ఇతర ఆడవాళ్ళ మనసుల్లో ఈసు పుట్టించడానికనీ ఆయన తేల్చేడు.

ఆడవాళ్ళ వ్యక్తిత్వం చాల బలమైనదని తెలుసుకోవాలి.

ఒక్కదెబ్బతో సింహాన్ని చంపేడనీ, వటి గతులతో 30 మందిని చంపేసేడనీ శాంసన్ గురించి మగాళ్ళు డబ్బాకొడతారు.

కాని, ఈ ధూర్తుణ్ణి అవలీలగా లొంగదీసింది దెలీలా.

అయితే, వాళ్ళ వ్యక్తిత్వం ఇంత గొప్పదయినా, తమ వయస్సువాట వచ్చేసరికి ఉక్కిరిబిక్కిరయిపోతారు.

ఒక పత్రం నింపుతున్నప్పుడు ఒకామె తన వయస్సు వ్రాయవలసి వచ్చింది. అడిగేరు. నా పెళ్లినాటికి నా భర్త నాకన్న రెట్టింపు వయస్సువాడు. ఆయనకప్పుడు 40 వుండేవి. ఇప్పుడు 60' అంది.

'అయితే మీకు 30 వుంటాయి.'

'అనే తోస్తూంది' అందామె.

వచ్చి పోయిన పదిహేను రోజుల తర్వాతనే ఆడవాళ్ళు ముసలివాళ్ళవుతారని సారిహూ దీవిలో మగవాళ్ళు అంటారనీ, ప్రపంచంలో వాళ్లంత మెత్తని మనస్సుగల వాళ్ళుండరనీ సిసీ దగ్గరుండు కారల్ ఇర్ అన్నారు.

— లిటురేవర్స్ యాగజెట్





# ఫారిన్ రిటర్న్డ్... లేక స్వదేశీ ఉద్యోగ పర్వాలకు అతీతులు

లేళ్ళపల్లి వెంకటలక్ష్మీనారాయణ

మనవి:— నేను చాలా రోజుల క్రిందట నిరుద్యోగ చిరుద్యోగ, గురుద్యోగ, సర్వాలను (ఉద్యోగ విరమణతో సహా) ఆంధ్ర సచిత్ర వారపత్రికలో వ్రాశాను. అవి వ్రాసిన తర్వాత యీ స్వదేశీ వుద్యోగ పర్వాలకు అతీతులైనవారు అంటే విదేశాలు వెళ్ళి స్వదేశం తిరిగొచ్చినవారి గురించి రాద్దామనే వుద్దేశ్యం వచ్చింది. నా మిత్రులు నాకత్యంత సన్నిహితులు అయిన డాక్టర్ కె. వి. ఎస్. శర్మగారు, (బ్రెయిన్ డ్రెయిన్ శర్మగారని, ఆస్ట్రేలియా శర్మగారని, మేం పిలుస్తూ వుంటాం.) 'బ్రెయిన్ డ్రెయిన్ అను అమెరికా మజిలీ కథలు' యీ పత్రికలోనే ప్రచురించేటప్పుడు యీ ఫారిన్ రిటర్న్డ్ కథలు రాయాలనే సంకల్పం మళ్ళీ వచ్చింది. కానీ థీసిస్ పూర్తిచేయాలనే ఆదుర్దా ముందుకూ యీ కథలు వెనక్కూ వెళ్ళినయ్.

ఇవి 'లైటర్ వెయిన్'లో రాసినా, కొన్నిచోట్ల వాస్తవానికి దూరం మాత్రం కావు. విదేశాల్లో చదువు కొచ్చిన వారిని కించ పరచాలనే దురుద్దేశ్యం నాకు లేదు. కానీ విదేశం వెళ్ళటమే పరమావధిగా భావించి, వెళ్ళటం వల్లనే యెంతో సాధించామనీ, సాధించాల్సింది యింకేమీ లేదనే దృక్పథంతో ప్రవర్తించే వాళ్ళకు అది సబబు కాదని చెప్పటమే యీకథల లక్ష్యం. ఇలా ప్రవర్తించే వాళ్ళు యింతవరకూ కొందరు, యీమధ్య మరింత మంది కనిపిస్తున్నారు. అలాగని అందరూ అలాంటి వాళ్ళేనని చెప్పకూడదు. విదేశాలు వెళ్ళటమేగాక, విజ్ఞానాన్ని ఆర్జించిన వారూ దాన్ని పెంపొందించిన వారు...యిలా ఎందరో మహానుభావులు: వాళ్ళందరకూ వందనాలే. కానీ, వెళ్ళొచ్చినందుకే చెయ్యాలి తప్పుఢా అంటే మనసొప్పదు మరి—

—డాక్టర్ లేళ్ళపల్లి వెంకటలక్ష్మీనారాయణ శర్మ.

★ అదిగాదిగో...అల్లదిగో...
భారత దేశోద్ధారకుడు...భారత దేశో...'
'స్వాగతం...సుస్వాగతం...
దేశోద్ధరణకు పూనుకుని, దేశ
సేవకై తిరిగి వచ్చిన త్యాగశీలునకు
స్వార్థరహితునకు స్వాగతం!
సుస్వాగతం!!'

ఈ పాట్నెవ్వరూ పాడటంలేదు; కనీసం రికార్డుల ద్వారా పాడిచటంలేదు కూడాను. అయినా ఫారిన్ వెళ్ళటానికి యెన్నోపాట్లు పడి వెళ్ళి తిరిగొచ్చే యిలాంటి పాటలు రావటంలేదేమిటా, యిలా జరగటం లేదేమిటా అన్న బాధలోంచి పుట్టిన భావాలు ప్రొఫెసర్ భం చేత యీ రాగాలు పలికిస్తున్నయ్. (అతగాడి పూర్తి పేరు పిసతల పద్మనాభం; అమెరికా వెళ్ళిన మొదట్లో చివరక్షరం మాత్రం సౌకర్యార్థం వుపయోగించారక్కడివాళ్ళు! మొదట్లో 'భం' అంటూ పిలిచేవాళ్ళు. రానురాను మాటలను సాగదీసి మాట్లాడందే విదేశీ ఉచ్చారణ రాదనే నమ్మకంతో పద్మనాభం యొక్క ఇండియన్ ఫ్రెండ్స్ 'భాం' అని పిలవటం మొదలెట్టారు. అమెరికన్లు మాత్రం 'భం' అనే పిలిచే వాళ్ళు; కాకపోతే వక్కొక్కప్పుడు వత్తును తప్పించేవాళ్ళు. ఇకముందు వీరిని 'భాం' అనిగాక పద్మనాభం అనే వ్యవహరిద్దాం. ఇండియాకు వచ్చేశారు కాబట్టి మనం యిలా సంబోధించినా వారు కోప్పడరనే ఆశాభావంతో యీపని చెయ్యొచ్చు) ప్రొఫెసర్ పద్మనాభం అమెరికాలోని ఒక యూనివర్శిటీలో ఒక డాక్టరేటు పుచ్చుకుని మరో యేడాది ఆ యూనివర్శిటీలోనే టీచ్ చేసి తిరిగి యీ దేశానికి సేవచేయాలనే వుద్దేశ్యంతో వచ్చేశారు. ఇప్పుడిలా రావటానికి ఒక్కా తొంభై కారణాలున్నయ్; కానీ పద్మనాభంగారు ఒకేఒక కారణం తన్ని దేశానికి తీసుకొచ్చిందంటారు. అదేమిటంటే—

'మన దేశంలోని బ్రెయిన్ డ్రెయినయిపోతోంది. ఇలా జరగటానికి వీల్లేదు. ఇలా జరిగితే దేశప్రగతికే గొడ్డలిపెట్టు; అందుకే నీ దేశానికి నీ శక్తిని (అంటే ఫారిన్ రిటర్న్డ్ శక్తిని) పణంగా పెట్టు; నీ శక్తికి వెలకట్టకు; వెలకట్టి యెల్లకాలం విదేశాల్లోనే వుండిపోకు; నీ దేశానికిరా...వచ్చిపోకు...నీ మేధాసంపత్తి నందరకూ పంచిపెట్టు.' ఈ దృక్పథమే తనిండియాకు రావటానికి కారణం అంటారు పద్మనాభంగారు. ఈ నాలుగుముక్కల్నీ బొంబాయిలో ప్లేన్ దిగిన వెంటనే విలేఖర్లకు చెప్పాలని యెంతో వుత్సాహ పడ్డారు పద్మనాభంగారు. ప్లేన్‌దిగి అక్కడెదురుగా నున్న కుర్రాడు చేతిలోని కెమేరాను చూసి తగిలించుకుంటుందేమో పద్మనాభంగారు నెలబిది దువ్వెన చేతిలోకి తీసుకున్నారు. కెమేరాక్లిక్ మన్లేదు; ఆకుర్రాడు అసక్తిగా పద్మనాభంవంక చూశాడు. కెమెరా క్లిక్ చెయ్యమన్నట్లు నవ్వుతూ తలాడిస్తూ చూశారు పద్మనాభంగారు. కుర్రాడు నవ్వాడుగానీ కెమేరాని క్లిక్ మనిపించలేదు. ఇక్కడ ఫోటోలు తియ్యకూడదేమోననని సరిపుచ్చుకున్నారు పద్మనాభంగారు; పుచ్చుకున్న మట్టి నాదిలేశారు.

'విలేఖర్లు రాలేదా?' అనడిగారు ప్రక్కగా వున్నారో అఫీసులాంటిగదిలో వున్నతన్ని. పద్మనాభంగారి అవస్థంతా గమనిస్తున్న ఎయిర్‌హోస్టెస్—

'లేదండీ...విలేఖరులందరూ బంగ్లాదేశ్ వ్యవహారాల్లో మునిగిపోయారు. ఎవ్వరూ లేని సమయంలో, రాని సమయంలో, కాని సమయంలో మీరిక్కడ తేలారు; పాపం!' అంది.

'ఇండియాలో కర్టెసీలేదు. మేం అక్కడున్నంతకాలం 'రండి ... రండి' అని చంపుకుతింటారు. వచ్చాక సంగతే పట్టించుకోరు. 'ఏరోడ్రోం'కు కూడా రారు' అంటూ విసుక్కున్నారు పద్మనాభంగారు.

'ఇలాగయితే మళ్ళీ తిరిగి అమెరికా

వెళ్ళిపోవాల్సిందే అని కొప్పడి భయ పెట్టారు కూడాను. ఇన్నిచేసి ఏయిర్ హోస్టు బయటకు వచ్చేశారు.

పద్మనాభం ఫారిన్ వెళ్ళకముందు గాలి తీస్తే వడిపోయేటట్లుండేవాడు; యిప్పుడు గాలినిండిన బంతిలా నున్నగా గుండ్రంగా తయారయ్యాడు. పూర్వం పద్మనాభం మెడ అందరకూ కనిపించేది; యిప్పుడు మెడ మాయమయ్యింది; భుజాలకు బుగ్గలకూ మధ్య యెడమే లేదిప్పుడు. ఫారిన్ వెళ్ళకముందు నడిచేటప్పుడు, సంభాషణ వడిపేటప్పుడు భుజాల అవసరం కనిపించలేదు. ఇప్పుడు మాట మాటకూ, చీటికీ మాటికీ భుజాలెగరేస్తున్నాడు. మాట్లాడనప్పుడు, మాట లేనప్పుడూ మరీ యెగరేస్తున్నాడు. భుజాలెగరెయ్యటంలో ఓపద్దతుంది. ప్రతివాక్యం (లేదా మాట) మొదలెట్టేటప్పుడు భుజాలు పైకిలేవటం మొదలెడ్తాయ్. వాక్యం పూర్తయ్యేసరికి రెండు భుజాలు రెండు చెవుల్నీ ముద్దెట్టుకుని సినిమాల్లో నాయికి తనను నాయకుడు మొదటిసారిగా కావలించుకున్న తర్వాత కరెంటు షాకు తిన్నట్టు పరిగెత్తిన వేగంకంటే సగం వేగంతో రెండు భుజాలు యథాస్థానాని కొస్తాయ్. తోలుబొమ్మలాటల్లో కొంత సేపటివరకూ అవసరంలేని బొమ్మల్ని క్రిందికి దించకుండా వోమూల గుచ్చుతారు. తెరమీద నిగతా బొమ్మలు కదులుతున్నప్పుడా కదలికకు ఈ బొమ్మలు చేతులూ కాళ్ళూ వూగుతూ వుంటాయ్; సరిగ్గా యిలాగే చేతులూపుతూ వుంటాడు పద్మనాభం మాట్లాడేటప్పుడు. ఇలా భుజాలెగరెయ్యటంలో యెంతో అర్థం వుంది. ఇండియాలో చదువుకుని, యిండియాలో వుద్యోగాల్చేసేవాళ్ళు పూర్తోమంటూ ఏమీ శక్తి లేనట్టుంటారు. బాధ్యతల్ని స్వీకరించటానికి శక్తిలేనట్టు, యేదో భుక్తికోసం అన్నట్టు వుద్యోగాల్చేస్తూ వుంటారు. అందుకని వాళ్ళ భుజస్కంధాలమీద యేలాంటిబరువు బాధ్యతలు పెట్టలేం; పొరపాటున కూడా పెట్టకూడదు; చాలా తప్పు; దేశానికే ముప్పు కాని ఫారిన్‌రిటర్న్స్ భుజాలు యెంతబరువైనా మొయ్యగలవ్; అందుకని ఆ భుజాలమీద దేశోద్ధరణ లాంటి బరువులు పడెయ్యవచ్చని మావిం చుతూ విదేశాలు తిరిగొచ్చిన వాళ్ళే భుజా లెగరేస్తారు.

భుజా లెగరెయ్యటంతో బాటుగా కుండా, యెగరేస్తూనే పద్మనాభం మరోపని చేస్తాడు. కళ్ళు పెద్దవిజేసి, కనుబొమలు పైకెత్తి తల ప్రక్కకు వేలాడేస్తాడు. భుజాలు పైకెగరవేసి క్రిందికి దించటం, కళ్ళు పెద్దవిజేసి కనుబొమలు పైకెత్తటం, తలప్రక్కకు వేలాడెయ్యటం — యీ మూడుపనులు ఒకేక్షణంలో చెయ్యగలగటం దెవ్వరూ అడగరుకదా!

పద్మనాభం నేర్చుకున్న మరో విషయం 'య్యా' అనటం. ఇండియాలో వుండిపోయినవాళ్ళకు 'కాన్ఫిడెన్స్'పోయి మాట్లాడితే 'అయ్యా' అంటారు. ఫారిన్ వెళ్ళి రావటంతో స్వశక్తిమీద నమ్మకంయేర్పడి 'య్యా' అంటారు. 'య్యా' అన్నది 'యస్'కు అపభ్రంశం (చదువరికి తెలియదని మనవి చెయ్యటంలేదని మనవి.) ఇలాంటి అపభ్రంశాలు బోల్డుచెప్పు పద్మ




పద్మనాభం ఫారిన్ వెళ్ళి నేర్చుకున్న మొదటి విద్య. దాన్నే బాగా సాధనజేశాడు. కొత్తలో నేర్చుకోవటం కష్టమనిపించి యిది బోధనా విషయంగా యే యూనివర్సిటీలో నన్నా వుందేమోనని వాకబు జేశాడు. ఓ డజను యూనివర్సిటీలు యీ విషయమై తిరిగాడు. అప్పటికా విషయం నేర్చుకున్నాడు. అందుకని అన్వేషణ మానేశాడు. అందుకే యిప్పటికీ 'నే నమెరికాలో పది పన్నెండు యూనివర్సిటీల్లో 'స్టడీ' చేశానంటాడు పద్మనాభం. 'ఏం స్టడీ చేశావ్'ని యిక్క నాభానికి.

ఇక వేషానికొస్తే పద్మనాభం వుపయోగించే భాషకూ, ప్రదర్శించే భావాలకూ ఆదేం తీసిపోదు. మగవెంపలు చెవిసగం దాపుల వరకే ఆపకుండా చెంపలో సగభాగంవరకూ వుంచుతాడు. జుట్టు దువ్వటం అన్న విషయం యెప్పుడోనే మరిచిపోయాడు. తైలసంస్కారాని కతగాడి జుట్టెప్పుడోనే తిలోదకాలిచ్చింది. పద్మనాభం యిండియా కొచ్చిన కొత్తలో అతగాడు బజారుమీద అతగాడి స్నేహితులకు కనబడితే వాళ్ళతో

గాడు పద్మనాభం అని కనిబెడితే 'ఎక్క డికి? సెలూన్‌కా?' అనడిగేవాళ్లు.

'అబ్బే!...అలా మా చుట్టాలింటికి బయల్దేరాను. అయినా యిప్పుడు సెలూన్ కెందుకు? క్రిందటి సమ్మర్‌లో కెనడా వెళ్లాను. టొరెంటోలో వక సెలూన్ మంచిదని నా ఫ్రెండ్ చెబితే అక్కడ చేయించాను. ఎలా వుంది కెనడా హెయిర్ కటింగ్?' అనేవాడు.

పద్మనాభానికి అతగాడి వంటిమీదున్న ప్రతి వస్తువూ—బూటు దగ్గర్నుంచి (డ్రాంట్లోని మేజోడు మినహాయించకుండా) అతగాడి జేబులో వున్న గుడ్డ వరకూ—యెక్కడ కొన్నాడో గుర్తే. అదీ అతగాడిలోని విశేషం. వాటిధర కూడా చెబుతాడు; అదీ అతగాడి ప్రజ్ఞ. ఇండియాలో చదువుకుని యిక్కడే వుద్యోగాల్జేసే వాళ్ళూ వున్నారు — యెందుకు? కుట్టించుకున్న సూటుధర, కొన్న స్వెటు ధరలు కూడా. గుర్తుంచుకోలేరు. వీరికి జ్ఞాపకశక్తి, మేధాశక్తి లేవన్నదాని కిది నిదర్శనం కాదూ? మరి పద్మనాభం విషయంలో అదేం కాదే! మీ రతగాణ్ణి అతగాడి చొక్కా ధరెంతో అడగండి; తొందర పడకండి...మీరెందుకూ అడగటం? అతగాడే చెబుతాడు...వినండి.

'ఇదెంత?!...న్యూయార్క్‌లో నాలుగు డాలర్స డెభ్భైఅయిదు సెంట్సకు కొన్నాను

# ఫారిన్...

...అక్కడ చాలా బావుంటయ్' అంటూ దాని ధర సెంట్లతో సహా, దానితోబాటు కొన్న సెంటుబుడ్డి సంగతితో సహా చెబుతాడు.

పద్మనాభం పాంటుకూ, అతగాడికాలికీ అవినాభావ సంబంధం వుంది. అవి రెండూ వకట్నొంటుకుని మరొకటుంటయ్. దర్జీగాడు పద్మనాభం కాళ్లచుట్టూ గుడ్డను చుట్టి అతగాణ్ణి మిషన్‌మీద పడుకోబెట్టి పాంటు కుట్టేశాడా అన్నట్టు చాలా 'టైట్'గా వుంటుంది. ఆ పాంటుకు పదంగుళాల వెడల్పు బెల్టు. పద్మనాభం యిండియా వచ్చేముందే రీసెంట్ ఫ్యాషన్ పాంటులు 'బెల్‌బాటం' పాంటులమీదికి దృష్టి మళ్లింది. కానీ యిప్పుడు వేసుకొచ్చింది టైట్‌పాంటే. పద్మనాభం వో నాలుగు 'బెల్‌బాటం' పాంట్సుకొని దగ్గిర పెట్టుకున్నాడు; అవిప్పుడు పెట్టెలో పెట్టుకొచ్చాడు.

ఇంత ధైర్యంగా యిక్కడకొచ్చి మాట్లాడగల్గుతున్నాడు గానీ పద్మనాభం వ్యవహారం అమెరికాలో చాలా దయనీయంగా వుండేది. పిహెచ్. డి. తీసుకున్నాక ఆ యూనివర్సిటీలోనే ఒక మంచి పోస్టొస్తుం దేమోనని చూశాడు. కానీ యేదో చిన్న టీచింగ్ పోస్టు యేడాదిచ్చి మానేశారు




ఏం చేద్దామా అని ఆలోచిస్తుంటే ఇండియాలోని ఒక ఇన్‌స్టిట్యూట్‌వాళ్లు అసిస్టెంట్ ప్రొఫెసర్ పోస్టు అడ్వర్టయిజ్ చేశారు.

ఇండియానుండి అప్లయ్ జేసేవాళ్లని పదో పదిహేనో కాపీలు నింపి యేదున్నర రూపాయల పోస్టలార్డర్తో సహా పంపమన్నారు. కొందర్ని రెండురూపాయల పోస్టలార్డరు మాత్రం పంపమన్నారు. పోస్టలార్డర్లేని అప్లికేషన్ స్వీకరింపబడదన్నారు. అప్లికేషన్ లేని పోస్టలార్డరు స్వీకరింపబడవచ్చు నన్నారు. ఒకసారి పంపిన డబ్బు యెంతమాత్రం త్రిప్పిపంపబడదన్నారు. (రెండుసార్లు డబ్బుపంపితే యేం చేస్తారో చెప్పలేదు.) ముందు డబ్బు సంగతి గోవిందా అన్నారు! తర్వాత వుద్యోగం సంగతి కూడా నంతే నన్నారు. ఇండియా నుంచి పంపే భక్తులు 'గోవిందా' అనుకుంటూనే అప్లికేషన్లు పోస్టాఫీసులో యిచ్చారు. కొన్ని నువ్వులు మరికొన్ని పువ్వులూ సిద్ధం జేసుకున్నారు. ఇండియాలో వున్నవాళ్లకిన్ని నిబంధనలు పెట్టారు. ఫారిన్‌నుంచి దరఖాస్తులు పంపదలుచుకున్నవారుమాత్రం తెల్లకాగితం మీద రాసి పంపగలరని విన్నవించుకున్నారు. డబ్బు పంపక్కర్లేదన్నారు, మధ్యలో చేసే యెంక్వయరీలకు సమాధానాలివ్వబడవ్ అని తెగేసి చెప్పారు. చేసేదేదో ముందే చెయ్యాలి కాబోల్సురా భగవంతుడా అనుకున్నారు అప్లయ్ చెయ్యదల్చుకున్నవాళ్లు.

ఈ ప్రకటన చేసిన ఇన్‌స్టిట్యూట్‌ను నడిపించే ఆయన అప్లయ్ జేసిన ఫారిన్ అభ్యర్థులలోంచి యెన్నుకునేందుగ్గాను యేడాదికోసారి భూప్రదక్షిణం చేస్తూ వుంటాడు. ఆ సంగతాయన వుత్తరోత్తరా యే పోస్టుకన్నా అప్లయ్ చేసేటప్పుడు రాసుకుంటాడు. అది వేరే విషయం. కానీ యీ సంవత్సరం ఆయన మరేదో గొడవలో పడి భూప్రదక్షిణం వాయిదా వేశాడు. ఇలా తెల్లకాగితం మీద రాసి పంపిన విదేశాల్లోని మన దేశీయులకి సంవత్సరం సేరుగా ఆర్డరు పంపాలని నిశ్చయించాడు.

ఈ ప్రకటన చూసి పద్మనాభం అప్లయ్ జేశాడు. అప్లయ్ జేసేటప్పుడు

అతగాడి మిత్రులు ప్రొఫెసర్ పోస్టిస్తే తప్ప రానని బెదిరించమన్నారు. ప్రొఫెసర్ పోస్టులో సీనియర్ ప్రొఫెసర్ జీతంకోసం బేరమాడమన్నారు. తనిండియాలో దిగంగానే మొదటికాలు విమానాశ్రయంలోనూ రెండోకాలు తనకు ఇన్‌స్టిట్యూటిచ్చే క్వార్టర్లోనూ పెట్టాలనే వుద్దేశ్యంలో వున్నట్టు తెలియజెయ్యమన్నారు. ఈ కోరికలన్నీ కోర్చుండగా హిరణ్యాక్షుడొచ్చాడు పద్మనాభం దగ్గరకు. వచ్చి—

'అయ్యా! మీరు పంపే దరఖాస్తు కాపీ నొకటిప్పించండి నాకు. నామీ దింతవరకూ నో అపవాదుంది. హిరణ్యాక్షుడి కోరికలవే సామెత లేవదీసి ఆ అపవాదొకటి నామీద వేశారు. నాకీ అప్రదిష్ట తొలగించినందు కెంతో ఋణపడ్డాను. ఓ కాపీ దయచేసి యిప్పించండి' అన్నాడు.

'అబ్బే...మా కోరికల లిస్టింకా అవ్వ లేదు. తర్వాత కనిపించు' అని పద్మనాభం స్నేహితులు హిరణ్యాక్షుణ్ణి పంపేశారు.

స్నేహితులెప్పిన కోరికలన్నీ రాద్దామనే అనుకున్నాడు పద్మనాభం. కానీ యెందుకో భయపడ్డాడు. తను ప్రస్తుతం వుంటున్న వుద్యోగానికింకో రెండునెల్లో ఉద్వాసన చెప్పేస్తారని గుర్తుకొచ్చి ప్రొఫెసర్ పోస్టడక్కుండా అసిస్టెంటు ప్రొఫెసర్ స్కేల్లో పదకొండొందలివ్వమన్నాడు. మిత్రులు తిట్టిపోశారు; జుట్టు కట్టి అతగాణ్ణి కొట్టేనంత పన్జేశారు. అప్లికేషన్ను పోస్టు చెయ్యనివ్వమన్నారు, విదేశాల్లో వుండే ఇండియన్సుకు ప్రతిష్ఠ తీసుకు రాకపోయినా అప్రదిష్ఠ మాత్రం తేవొద్దన్నారు. ఫారిన్ రిటర్న్డ్ వాళ్ళమీద 'ఫ్రాడ్ నా పీ నియన్' కలగచెయ్యొద్దని పోరు పెట్టారు.

'నేను ప్రొఫెసర్ పోస్టడిగితే యివ్వకుండా నా దరఖాస్తుని అవతల పారేస్తే నాకు మరో వుద్యోగం చూసి పెడ్తారా యిక్కడ? పోనీ నేనే చూసుకుంటాను; మరో వుద్యోగం దొరికేదాకా భోజనం పెడ్తారా?' అన్నాడు పద్మనాభం.

'మొత్తానికి గట్టివాడివే' అని మిత్రులు మెత్తబడ్డారు. 'నువ్వు చెప్పిన రెండూ వెనలూ కష్టమే...అప్లయ్ చెయ్ పో' అన్నారు.

# బ్రైట్స్ డిసీజ్

పి. రమేష్ నారాయణ

వంశపారంపర్య లక్షణాలను వర్ణించే ఆనువంశిక విజ్ఞానానికి మూల పురుషుడు జన్యుశాస్త్ర పితామహుడు అగు మెండెల్ మహాశయుడు 1874 వ సంవత్సరంలో బాధాకరమైన మరణం అనుభవించటానికి కారణం 'బ్రైట్స్ డిసీజ్' అని చెప్పబడుతూంది. శాస్త్రీయంగా ఈ వ్యాధిని 'గ్లోమరూలోనెఫ్రిటిస్' అంటూ వ్యవహరిస్తారు. మూత్ర పిండాలకు సంబంధించిన ఈ రోగం బ్లడ్‌ప్రెషర్, బలహీనత, రాత్రిళ్ళు చాలా మార్లు మూత్రం విసర్జించుట లాంటి లక్షణాలను కనబరుస్తుంది. దీని తొలి దశల్లో జ్వర లక్షణాలతో పాటు కళ్ళు వుబ్బటం వీపునొప్పి, చెవిపోటు, కాళ్ళ వాపులు వ్యక్తమవుతాయి.

ఈ రోగులు విసర్జించే మూత్రం ద్వారా రక్తము, ఆల్బుమిన్స్ అన్న ప్రోటీను అంశాలు అధికంగా నష్టపోతూంటారని నిపుణుల పరీక్షలు వెల్లడిస్తున్నాయి. కొలంబియా యూనివర్సిటీ కాలేజ్ ఆఫ్ ఫిజీషియన్స్ అండ్ సర్జన్స్‌కు చెందిన డాక్టర్ డికిన్సన్ రిచర్డ్స్' అభిప్రాయంప్రకారం స్కార్ టిష్యూ ఈ రోగానికి దారి తీయొచ్చుట.

ఈ వ్యాధికి ఖచ్చితమయిన వైద్య నివారణంటూ లేదని అమెరికన్ మెడికల్ అసోసియేషన్ వైద్య శాస్త్రజ్ఞుల అభిప్రాయం. ఈ రోగులు నాటువైద్యం చికిత్సలు పొందకుండా నిపుణుడయిన వైద్యుడినే సంప్రదించాలి. 1950 వ సంవత్సరంలో యునైటెడ్‌స్టేట్స్ నందు స్థాపించబడ్డ 'నేషనల్ కిడ్నీ డిసీజ్ ఫౌండేషన్' అన్న జాతీయవైద్య సంస్థ మూత్రపిండాలకు సంబంధించిన ఇలాంటి వ్యాధుల నివారణకు ప్రముఖంగా కృషి చేస్తున్నది. అమెరికాలో ప్రతి వందా పాతిక అమెరికన్లకు ఒక వ్యక్తి ఈ వ్యాధితో బాధపడుతున్నాడని ఆ సంస్థకు చెందిన పరిశోధకులు ఒక సర్వేలో వెల్లడించారు.

నవీన పరిశోధనలు రూపొందించిన కృత్రిమాంగాల్లో మూత్రపిండాలను మార్పిడి ప్రయోగాల ద్వారా ఈ రోగ నివారణకు మార్చుకోవచ్చు గాని ఎక్కువ డబ్బు ఖర్చుతో కూడిన ఈ చికిత్స సామాన్యుడి కందుబాటులో లేని అంశమే. ఒక్కోసారి ఇలాంటి మార్పిడులు విఫలమయితే రోగి ప్రాణానికే ముప్పు రావచ్చు.

మూత్రపిండాలకు సంబంధించిన ఈ వ్యాధి గల వ్యక్తులు ఉప్పు తక్కువగవుండే ఆహారాన్ని, ప్రోటీను ప్రమాణాలు తక్కువగ వుండే పదార్థాలను, మినరల్ వాటర్‌ను పుచ్చుకోవాలి. ఆహారంలో ముఖ్యంగా కార్బోహైడ్రేటు పదార్థాలు అధికంగా తీసుకొంటూ, ప్రతి దినమూ కనీసం 100—200 గ్రాములు గ్లూకోజులాంటి చక్కెర పదార్థాలు విధిగ గ్రహించాలి.

ఈ రోగులు ఎక్కువ కాలం పడకపై విశ్రాంతిని పొందుతూండాలి. వ్యాధి లక్షణాలు తగ్గుముఖం పట్టినా మూత్రంలోని ఆల్బుమిన్ శాతాన్ని గమనించటానికి తరచూ మెడికల్ చెకప్ చేయించుకోవాలి. శస్త్రచికిత్సలు, దంత వైద్యము గావించుకొనే పరిస్థితుల్లో, రోగి తనకు నెఫ్రిటిస్ వుండేదన్న విషయం విధిగ వైద్యులకు తెల్పటం ద్వారా 'ఇన్‌ఫెక్షన్' నివారించుకో గలుగుతారు.

ఈ అంశానికి సంబంధించిన మరో ముఖ్యవిషయం— ఇతర మూత్రపిండాల వ్యాధులగు నెఫ్రోసిస్, సిస్టైటిస్, పైలోనెఫ్రిటిస్ లాంటివి 'బ్రైట్స్ డిసీజ్'కు చాలా సన్నిహితంగా రూపాంతరంచెందిన వ్యాధులని తేలటమే. ఏది ఏమయినా సరయిన వైద్య సలహా, చికిత్సా అంటూ సకాలంలో లేకపోతే వ్యక్తులకు ఖచ్చితంగా ప్రాణాపాయం కలిగిస్తుందీ వ్యాధి బృందం. ఇంకా ప్రారంభ స్థాయిలోనే వున్న ఈ అంశానికి సంబంధించిన వైద్య పరిశోధనలు త్వరలోనే సత్ఫలితాల నిస్తాయని ఆశించటం కన్నా ఇప్పట్లో చేయగలిగిందేమీ లేదు.

'అదీ అట్లా రండి దారికి... అయినా అలా పోస్టయినా వస్తుందో లేదో' అన్నాడు విచారంగా పద్మనాభం.

'అదిగో ... ఆ మాటంటే మాత్రం ఒప్పుకోం' అన్నారు మిత్రులు.

'ఏమిటంత గ్యారంటీ? ఇట్లా డాక్టరేట్లున్నవాళ్ళూ, అనుభవం వున్నవాళ్ళూ అక్కర్లేదా' అన్నాడు పద్మనాభం.

మిత్రుల్లోని ఒక జ్ఞాని ముందుకొచ్చి చెప్పటం మొదలెట్టాడు.'

'నువ్వు వయ్‌జేశేది యిండియాకు. అక్కడ మనుష్యు లెలాంటివాళ్ళు?' అన్నాడు జ్ఞాని.

'నల్లవాళ్ళు' అన్నాడు పద్మనాభం షాక్ చేస్తున్నట్లు.

'ఒరేయ్! ఇక్కడొచ్చిన రంగుచూసి పొంగిపోకు. ఈ పెరుపెంతో కాలం నీకుండదులే. మునుపెంతో యిండియా కెళ్ళాక యికముందూ అంతే ... మిడిసి పడకు' అని.

'అట్లా మాట్లాడకు... కళ్ళు తెరయ్... నీ రంగుయి మాసిపోయ్...రంగుమాత్రం పోనీకు' అని చెప్పిడి, సలహాయిచ్చి కొనసాగించాడు జ్ఞాని.

'ఇండియాలోని మనుష్యులకు మొదటి నుంచీ అంటే చరిత్ర మొదలుపెట్టిన దగ్గర్నుంచీ కొన్ని లక్షణాలు వెంటబడొస్తున్నట్లు మనకంట బడుతుంది యే

## ఫారిన్ ...

చరిత్ర పుస్తకం తెరిచినా. అందులో మొదటిది! మనవాళ్ళకు పొరుగింటి పుల్లకూర రుచి. దాన్ని మెచ్చుకోవటం, పుచ్చుకోవటం ఆచారం. అలా చెయ్యకపోవటం అపచారంగా భావిస్తారు. దీనికితోడు మన శాస్త్రాలు 'పెరటిచెట్టు వైద్యానికి పనికిరాదు' అని ఘోషిస్తున్నాయ్. అందుకే యెక్కడో వున్న చెట్టునే పోషిస్తాం మనం. బయటనున్నదే మనం కతుకుతాం. అలాగే బ్రతుకుతాం.'

'ఇక రెండో సంగతి. మొగుడికి ఇంట్లో వున్న పెళ్ళాం అందంగా కనిపించటం జరగని విషయం. అందరికీ తెలిసిందే. ఇది యిండియన్ విషయంలో మరీను. ఫారిన్‌లో అయితే తన పెళ్ళాంగాని ఆడదానికి చూపించినంత పొగడ్త, గౌరవం పెళ్ళానిక్కూడా చూపిస్తాడు మగడు. 'యూ ఆర్ బ్యూటిఫుల్ టుడే, డార్లింగ్!' అంటారు. ఈ విధంగా పెళ్ళయిన రోజు నుంచీ రోజూ అలు పుచ్చుకునే రోజు వరకూ యెంతో మోజుతో, అంతే జోరుగా జోరీగలాగ అంటూనే వుంటారు. వాళకి బోరు కొట్టదు. మరి యిండియన్ మొగుళ్ళిట్లా అనరే, పెళ్ళయిన మొదటి సంవత్సరంలో తప్ప. ఇండియన్ పెళ్ళాం మాదిరే యిండియన్ పి.హెచ్.డి. క్కూడా వచ్చిన మొదటి సంవత్సరాంతం వరకే. గౌరవం! మరి నీడిగ్రీకో? పరదేశంలో వచ్చింది. పారిజాతాని కున్నంత విలువుంది. అది నిత్య నూతన సౌందర్యవతి. నీడిగ్రీ గురించి అదొచ్చిన చోటుగురించి నువ్వు చచ్చేదాకా చెప్పుకోవచ్చు. ఇండియాలో నీడిగ్రీని కళ్ళకద్దుకుని (కళ్ళద్దాల్లేనివాళ్ళు కూడా) నిన్ను నెత్తినెక్కించుకుంటారు సెలెక్షన్ బోర్డువాళ్ళు. తర్వాత నిన్నే పదిమంది నెత్తిమీద పెడతారు. వాళందరూ నీకు బ్రహ్మరథం పడతారు. కానీ వెనకాలేడుస్తారు నిన్నుజూసి (ఇదిగో...యిది రాసేవాడలాంటివాడని నా అనుమానం... సరే యిప్పుడేం అనకు...ఏం రాస్తాడో చూద్దాం. తర్వాత ఘాటుగా ప్రత్యుత్తరాలిద్దాం... అయినా యెందుకూ?... ఇండియా వెళ్ళి యితగాడి అడ్రసు కనుక్కొని.. ఫారిన్ పంపించి వో ముద్దపెట్టేస్తే యేర్పాటుచేద్దాం. యింకిలాంటివి రాయడు.) వాళ్ళ కళ్ళనీళ్ళు తుడవాలని కూర్చోకు. వాళంతే...దేశం కర్మలు. అజ్ఞానాన్ని వదలరు. ఇండియాలోనే పైపోస్టులక్కని పెట్టి కూర్చుంటారు. ఏమీ కనిపెట్టరు. ఒక్కసారి ముట్టరు...వాళ్ళంతే... వాళ్ళసంగతొదిలెయ్...ఇందువల్ల నీకీ పోస్టురావటం ఖాయం. అదీ యిప్పటి యిండియాలోని న్యాయం. వాళ్ళకిస్తారు తప్పకుండా కావాలి నీ సాయం.' అని భరోసా యిచ్చారు.

'అలాంటప్పుడు నీకెందుకు భయం' అని ధైర్యం చెప్పారు మిత్రులు.

'కావాలంటే బెట్' అన్నారు మళ్ళీ.

మిత్రులవాక్కు నిజమయ్యింది.

తర్వాత రెండు నెలలకు 'ఇండియాలో జరిగిన యింటర్వ్యూలో పది పదిహేను కాపీలు నింపి పంపిన అభ్యర్థులందర్నీ (ఒకే డిపార్ట్‌మెంటులో వుంటూ నలుగురైదుగురికి డాక్టరేట్లు యిప్పించినవారితో సహా) ముక్కుతూ, మూలుగుతూ 'ఇంటర్వ్యూ చేశాం' అని అనిపించేసి వాళ్ళని పంపేసి ఆర్డరుమాత్రం అమెరికాలోని పద్మనాభానికి పంపారు తప్పుల్లేకుండా. పదేళ్ళనుంచీ లెక్చరర్లుగా వుంటూ, ఢిల్లీ నాడు డాక్టరేట్లొచ్చుకుని నలుగురైదుగురు స్టూడెంట్లకు డాక్టరేట్లు తెప్పించిన ముగ్గురి నెత్తిమీదొచ్చి కూర్చుందుగ్గాను యిండియాకు వి(వ)చ్చేశాడు పద్మనాభం. (ఇంకా వుంది)

# సినిమా

## హిందీలో రమాప్రభ!

ఇంతవరకు తెలుగు, తమిళ చిత్రాలతో సరి పెట్టుకున్న రమాప్రభను హిందీ హాస్య నటుడు మహమూద్ తను నిర్మిస్తున్న హిందీ చిత్రంలో ఒక ముఖ్య పాత్ర ద్వారా ఆ ఫీల్డుకి పరిచయం చేస్తున్నారు.

## దేవుడు వున్నాడా?

విధి వంచితుడైన పసిబాలుడు విమానం ఎడారిలో కూలగా, ఏకాకిగా నీరు, తిండీ లేక అలమటించాడు. అతని మొరను ఆలకించే నాథుడే కరువయ్యాడు. కన్నతల్లి, తండ్రి ఎక్కడో ఉన్నారు. వారిని దరి చేరలేడు. చేరడానికి మార్గమూ తెలియదు. ఏ పాపం ఎరుగని ఆ పసికందుపై భగవంతుడు ఎందుకు పగ బూనినాడు? అందుకే విధివ్రాత తప్పింప ఎవరి వశము? అంటారు మన పెద్దలు.

ఎడారిలో దిక్కు, మొక్కు లేక అల్లాడే ఆ పసివాడు దీనావస్థను ఆచార్య ఆత్రేయ ఎంత చక్కగా లిఖించాడో చూశారా?

'అయ్యో పసివాడా అయ్యో పాపం పసివాడా
దేవుడు వున్నాడా, నీపై ద్వేషం పూనాడా
అభము, శుభము ఎరుగని నిన్ను అనాథ చేశాడా'

అనెడి యీ పాటను ఘంటసాల ఎంత ఘనంగా పాడియుంటారో మీరే వూహించండి. ఇదంతా శ్రీ లక్ష్మీ ప్రొడక్షన్స్‌వారి 'పాపం పసివాడు' చిత్రంలో కనిపిస్తుంది. మీ హృదయాన్ని ద్రవింప చేస్తుంది. ఏ. పూర్ణచంద్రరావు నిర్వహణలో పూర్తి రంగుల్లో నిర్మితమైన యీ చిత్రానికి వి. రామచంద్రరావు దర్శకుడు. లక్ష్మీ విడుదల.

## పల్లెటూరే భాగ్యసీమ

మద్రాసుకు 30 మైళ్ళ దూరంలో దండిమెట్టు అనే గ్రామం వుంది. ఆ గ్రామంలో హీరో కృష్ణకు బోలెడంత పొలం వుంది. ఆ పొలం సంగతి వాళ్ళ మేనమామ ఎరుగు అని కృష్ణ పట్నపు జీవితానికి అలవాటు పడ్డాడు. చెడు సహవాసంవల్ల కొన్నాళ్ళ దురలవాట్లకు బానిస అయినా, తన అర్థాంగి పుణ్యమా అంటూ మంచివాడుగా మారాడు. అతడ్ని మంచి మనిషిగా, తీర్చి దిద్దిన ఘనత వాణిశ్రీకే చెందుతుంది. మంచివాడయినదాది, ఆమె చెప్పిందే వేదవాక్యంగా ఎంచి, అలాగే ప్రవర్తించేవాడు కృష్ణ. తదనుసారంగా, తన యిల్లాలి సలహాను పాటించి పట్నం వదలి, గ్రామంలో మకాం పెట్టాడు కృష్ణ.

గ్రామంలోని పైరు పంటలను చూచి మురిసిపోతూ, దేశ సౌభాగ్యానికి పల్లెసీమలే జీవనాడులన్న విజ్ఞాన్ని గ్రహించి, ఒక చక్కటి పాటను ఆలాపించారు. ఏమని?

వాణిశ్రీ: పల్లెటూరు మన భాగ్యసీమరా,
పాడి పంటలకు కొలు లేదురా,
కృష్ణ: మంచితనం మమకారం
మనిషి మనిషిలో కనపడురా

అన్న పాటను కొసరాజు వ్రాయగా, సుశీల, ఎస్. పి. బి. పాడారు. కె. సుబ్బిరెడ్డి సమర్పించే 'ఇల్లు—ఇల్లాలు' చిత్రంలోనిదే యీ దృశ్యం పి. చంద్రశేఖరరెడ్డి దర్శకత్వంలో నిర్మితమయ్యే యీ చిత్రానికి ఎస్. సుబ్బరాయుడు, జె. వి రామసుబ్బయ్య నిర్మాతలు.

నందినీ ఫిలింస్ నిర్మిస్తున్న 'ఇల్లు—ఇల్లాలు' చిత్రానికి మాలతీదేవి కథను, ఆరుద్ర, అప్పలాచార్య మాటలను సమకూర్చారు. ఈ చిత్రానికి మహదేవన్ సంగీతాన్ని, సుకదేవ్ ఛాయను, కృష్ణారావు కళను, బ్రహ్మానందరావు సహకార దర్శకత్వాన్ని, పూర్ణచంద్రరావు సహాయ దర్శకత్వాన్ని నిర్వహిస్తున్నారు. పి. వి. రమణయ్య నిర్మాణ నిర్వహణలో తయారవుతున్న యీ చిత్రంలో వాణిశ్రీ ద్విపాత్రాభినయం ప్రత్యేక ఆకర్షణగా ఉంటుంది.

## పేరు మార్పు!

రామ విజేతా సోదరులు దీక్షిత్ అనే నూతన నటుడ్ని తమ 'రామరాజ్యం' చిత్రంలో పరిచయం చేస్తున్నట్టు, శ్రీ పూర్ణా మూవీస్, సారథి అండ్ టి. పి. ఆర్. కంబైన్స్ చిత్రాల్లో వేషాలు వేస్తున్నట్టు పాఠకులకు తెలిపియున్నాను. ఆయన తన పేరును మార్చుకున్నారు. ఇకమీదట ఆయన సత్యనారాయణ దీక్షిత్‌గారు—శరత్‌బాబు అవుతారు.

## ఆరు కేంద్రాల్లో వంద రోజులు

ఉషశ్రీవారి 'మానవుడు—దానవుడు' చిత్రం ఆంధ్రప్రదేశ్‌లో దిగ్విజయ యాత్ర సాగిస్తూ వుంది. ప్రస్తుతం 11 వ వారంలో పడింది సెప్టెంబర్ 30 న ఆరు కేంద్రాలలో శతదినోత్సవం జరుపుకోబోతుంది. వంద రోజుల పండుగను వైభవంగా జరపడానికి నిర్మాత చిన్నపరెడ్డిచే నిశ్చయింపబడింది. ఈ విజయం పరిశ్రమలో కొత్త బాటను యేర్పరచింది. ఈ చిత్రం ఉషశ్రీ బ్యానర్ విలువని పెంచింది. నిర్మాత బాధ్యతను పెంచింది. శోభన్‌కి కొత్త జీవితాన్ని ప్రసాదించింది.

## ప్రేమ పక్షులు

'మానవుడు—దానవుడు' సెప్టెంబర్ 30 న శత దినోత్సవం జరుపుకుంటే, ఉషశ్రీ ప్రొడక్షన్స్‌యొక్క నాలగవ చిత్రం షూటింగు అక్టోబర్ 2 న ప్రారంభం అవుతుంది. ఈ చిత్రానికి 'ప్రేమ పక్షులు' అని నామకరణం జరిగింది. కథను ఉషశ్రీ రచింపగా, మాటలను మోదుకూరి జాన్సన్ వ్రాస్తున్నారు. పర్మనెంటు సభ్యులైన సుకదేవ్, అశ్వత్థామ, అంకిరెడ్డి, మోహన్‌గాంధి, సూరన్న సాంకేతిక శాఖలను నిర్వహిస్తారు. ఇంతదనుక నిర్మాతగా మాత్రమే వుండిన చిన్నపరెడ్డి యీసారి దర్శకత్వం కూడా చేపట్టారు. అనిల్ ప్రభాస్ విడుదల.



# సినిమా

## దసరాబుల్లోడి మానవుడు—దానవుడు

దసరా బుల్లోడు చిత్రాన్ని నిర్మించి, నిర్మాతగా అత్యధిక లాభాల్ని గడించి, దర్శకునిగా గొప్ప పేరును సంపాయించిన జగపతి అధినేత వి. బి. రాజేంద్రప్రసాద్ త్వరలో తమిళరంగాన్ని ప్రవేశించబోతున్నారు.

తెలుగులో అఖండ విజయాన్ని సాధించిన 'మానవుడు—దానవుడు' చిత్రాన్ని తమిళంలో జగపతి బ్యానర్‌లో నిర్మించబోతున్నారు. దర్శకత్వం కూడా ఆయనే. శోభన్ ధరించిన వేణు జగన్ పాత్రలను తమిళంలో శివాజీ పోషిస్తారు.

## బంగారుబాబు నాలుగవ షెడ్యూలు

జగపతి ఆర్ట్ పిక్చర్స్ ఈస్ట్‌మన్ కలర్‌లో నిర్మిస్తున్న 'బంగారు బాబు' నాలుగవ షెడ్యూలు ఆగస్టు 30 కి పూర్తయింది. దీంతో చిత్రం సగంపైగా వచ్చింది. ఇంతవరకు ఆరు పాటల చిత్రీకరణ, హెలికాప్టర్ ఫైట్, మరికొన్ని ముఖ్య సన్నివేశాల చిత్రీకరణ జరిగింది. సెప్టెంబర్, అక్టోబరు, నవంబరు షెడ్యూలులో షూటింగు పరిసమాప్తమవుతుంది. సంక్రాంతికి ఆంధ్ర ప్రేక్షకులకు కనువిందు కలిగిస్తుంది.



పై చిత్రానికి కథ, సినిమా అనుకరణ, దర్శకత్వంను వి. బి. రాజేంద్రప్రసాద్ నిర్వహిస్తున్నారు. మాట పాటలను ఆచార్య ఆత్రేయ, సంగీతాన్ని మహదేవన్, కళను కృష్ణారావు, కూర్పును సంజీవి చూస్తున్నారు.

ఇటీవల 'బంగారు బాబు' రషన్ చూసిన కొందరు, 'దసరా బుల్లోడు' ద్వారా ఆర్జించిన పేరును యీ చిత్రం ద్వారా మరింత పెంచుకునే విధంగా రాజేంద్రప్రసాద్ టేకింగ్ వుందని, ఎస్. వెంకటరత్నం ఛాయాగ్రహణం అత్యద్భుతంగా వుందని చెప్పుకుంటున్నారు. ప్రేక్షకులు పెట్టుకున్న ఆశలు అడియాసలుగావు. ఈచిత్రంలో నాగేశ్వరరావు, వాణిశ్రీ, జయంతి, నాగభూషణం, రాజబాబు, రమాప్రభ, ప్రధాన పాత్రధారులు. గెస్టు పాత్రలను ఎస్వీ రంగారావు, గుమ్మడి, పద్మనాభం, రమణారెడ్డి పోషిస్తున్నారు. అన్నపూర్ణా విడుదల.

## బంగారుబాబు దర్శకత్వం

బంగారుబాబు చిత్రానికి దర్శకత్వం వహిస్తున్న వి. బి. రాజేంద్రప్రసాద్, శోభన్‌బాబు కథా నాయకుడిగా నటిస్తున్న చిత్రానికి డైరెక్షన్ని చేపట్టారు. పల్లవి ప్రొడక్షన్స్ పేరిట అక్కినేని ఆనందరావు నిర్మించనున్న యీచిత్రం త్వరలో ప్రారంభమవుతుంది.

## సుభాషిణిలో జమున

'వింత దంపతులు' విజయాన్ని పురస్కరించుకుని, దర్శక—నిర్మాత హేమాంబరధరరావు సెప్టెంబర్‌లో మరొక చిత్రాన్ని ప్రారంభించే ప్రయత్నాలను పూర్తి చేశారు. భమిడిపాటి కథ, మాటలను వ్రాసే యీ చిత్రంలో జమున, నాగభూషణం, కృష్ణంరాజు ముఖ్య పాత్రధారులు.

## కృష్ణ విజయం ...

పాఠకులకు కేవలం సినిమా పరిశ్రమలో జరిగే వార్తలను మాత్రం అందించడం నా అభిమతం కాదు. జనవాక్యాన్ని సేకరించి, వాళ్ల తీర్పును తెలిపితే చిత్ర రంగపు వ్యక్తులకు నిజం తెలిసి వస్తుంది.

గత వారం నేను తిరుపతి, నెల్లూరు, గుంటూరు విజయవాడలకు వెళ్ళాను. 'పండంటి కాపురం, ఇన్‌స్పెక్టర్ భార్య, కన్నతల్లి' చిత్రాలను చూశాను. హీరో కృష్ణ కనిపించినప్పుడల్లా ప్రజలు కరఘోష చేసి, తమ ఆనందాన్ని వ్యక్తపరచడాన్ని కళ్లారా పరికించాను. కృష్ణ, విజయ నిర్మల జంటగా నటించడంవల్ల వాళ్లకు ఎలాంటి యిబ్బందిలేదు అన్న నిజాన్ని గ్రహించాను. నాగేశ్వరరావు, రామారావులు గడించిన ప్రేక్షక అభిమానాన్ని యిప్పుడు కృష్ణ, శోభన్‌బాబులు అందుకుంటున్నారు. వీళ్లిద్ద

లకీ భోలెడన్ని అభిమాన సంఘాలు ఉండడాన్ని లెక్కించాను.

గత నాల్గయిదు మాసాల్లో విడుదలైన కృష్ణ చిత్రాలన్నీ నిర్మాతలకి లాభాలను ఆర్జించిపెట్టాయి. కృష్ణను డాషింగ్ హీరో అంటున్నారు, జనం. వారి మనంబు సంతృప్తి బడయ, కృష్ణ మున్ముందు కృషి చెయ్యగలరని ఆశిస్తున్నాను.

## కొత్త డైలాగు రైటరు!

హరికృష్ణా ఫిలింస్ నిర్మిస్తున్న చిత్రానికి గోపీ అనే కొత్త డైలాగు రైటరుచేత చిత్రంయొక్క సంభాషణలను నిర్మాత బి. వి. కృష్ణమూర్తి వ్రాయిస్తున్నారు. ఈ రచయిత యిదివరకే అయిదారు చిత్రాల్లో పాటలను రచించియున్నారు. ఇప్పుడు విజయవంతంగా ప్రదర్శింపబడుతున్న ''పండంటి కాపురం''లో వినిపించే 'మనసా' పాటకు కర్త యీ గోపీయే. 'పచ్చని సంసారం'లోని 'రాధ మనసు' పాటను కూడా యీ యువ రచయిత వ్రాశారు.

## పెళ్ళిరోజు సారధి

'పెళ్ళిరోజు' చిత్రాన్ని మీరు చూశారుగా! ఆ చిత్రంలోని పాటలన్నీ హిట్ అయిన సంగతి మీకు తెలుసుగా. ఆ చిత్రాన్ని నిర్మించిన వ్యక్తి పేరు శ్రీరామ్. సంగీత సారధి కూడా వారే.

ఆ శ్రీరామ్‌చేత హరికృష్ణా ఫిలింస్‌కి సంగీత సారధ్యం చేయిస్తున్నారు బి. వి. కృష్ణమూర్తి. ఈ చిత్రానికి ఎడిటింగు, దర్శకత్వం బాధ్యతని హరినారాయణ నిర్వహిస్తున్నారు.

పై చిత్రంలో విజయనిర్మల, ఎస్వీ రంగారావు, రామకృష్ణ, సత్యనారాయణ, సి. హెచ్. కృష్ణమూర్తి ముఖ్య పాత్రధారులు.

# సినిమా

## త్రివేణిలో రామారావు!

'బడిపంతులు' చిత్రాన్ని నిర్మించిన పి. పేర్రాజుకు ఎన్టీ రామారావు డిశంబరునుండి కాల్షీట్లు యిచ్చారు, రెండవ చిత్రంలో నటించడానికి.

మొదటి చిత్రం చూచిన మద్రాసులోని ప్రతి ప్రేక్షకుడు ఎన్టీ రామారావుగారి నటనా వైదుష్యాన్ని వేనోళ్ళ పొగుడుతున్నాడు. 'బడిపంతులు' పాత్ర ప్రేక్షక హృదయాల్లో చెరగని ముద్ర వేస్తుంది అంటున్నారు సినిమాను వీక్షించిన పెద్దలు. నిర్మాత పేర్రాజుకు రాజయోగాన్ని యిస్తుంది, అంటున్నారు చిత్రాన్ని వీక్షించిన విజ్ఞులు. ఈ సీజన్‌లో పూర్ణా సంపిణీ సంస్థకి యీ చిత్రం మూడవ విజయం అవుతుంది.

## జోతిలో శోభన్!

అన్నపూర్ణా సినీ ఎంటర్‌ప్రైజస్ నిర్మించనున్న చిత్రానికి జోతి పంపిణీ హక్కులను తీసుకున్నారు. పి. రఘునరావు నిర్మించే యీ చిత్రానికి కె. విశ్వనాధ్ దర్శకుడు. ముఖ్య పాత్రలను శోభన్, శారద, జయంతి పోషిస్తున్నారు. మాటలను బొల్లిముంత, సంగీతాన్ని చక్రవర్తి, ఛాయను జి. కె. రాము, కూర్పును అంకిరెడ్డి నిర్వహిస్తారు. షూటింగు అక్టోబర్ 23 న ప్రారంభమవుతుంది.

## భర్త ఒక చోట
## భార్య ఒక చోట

కన్న బిడ్డల ధర్మమా అంటూ బడిపంతులు



నవశక్తి చిత్ర రికార్డింగ్ సందర్భంగా రమణ, జి. కె. వెంకటేష్, దాశరథి, యమ్. మల్లికార్జునరావు, జానకి.

రాఘవరావు, అతగాడి భార్య జానకి వృద్ధాప్యంలో వేర్వేరు ప్రదేశాల్లో వుండవలసి వచ్చింది. తన ప్రాణ సమానురాలయిన జానకి వద్దనుండి ఉత్తరం వస్తుందా అని వేయికండ్లతో ఎదురు చూశాడు రాఘవరావు.

ఎన్నో రోజులనుంచి ఎదురు చూచిన ఉత్తరం రానే వచ్చింది. ఉత్తరం వచ్చిందన్న సంబరంలో కళ్ళజోడు కిందపడి, పగిలి ముక్కలైంది. పాపం రాఘవరావుకు ఒక ప్రక్క ఆతురత, మరోప్రక్క చదవలేని అవస్థ సంభవించింది. ఏం చేస్తాడు? వియ్యంకుడు పాపారావును కళ్ళజోడు ఎరువు అడిగాడు. సార్థక నామధేయుడయిన పాపారావు ఉబ్బసాన్ని క్షయ అని చెప్పి మనవడ్ని, కోడల్ని దూరం చేశాడే? అలాంటి వ్యక్తి కళ్ళజోడు నిస్తాడా? కనీసం చదివి చెప్పటానికి కూడా నిరాకరించాడు. చేసేదిలేక కుప్పలాగా కూలిపోయాడు రాఘవరావు. ఈ ఉదాత్తమైన సన్నివేశం త్రివేణివారి 'బడిపంతులు' చిత్రంలో కంట తడిపెట్టించే విధంగా చిత్రీకరించబడింది. బడిపంతులుగా ఎన్టీ రామారావు, పాపారావుగా నాగభూషణం, జానకిగా అంజలీదేవి నటించారు. పి. పేర్రాజు నిర్మిస్తున్న యీ చిత్రానికి పి. చంద్రశేఖరరెడ్డి దర్శకుడు. పూర్ణా విడుదల.

## పాపం పసివాడులో నరబలి

విధి వంచితుడైన పసిబాలుడు ఎడారిలో దీనావస్థకు లోనై, వున్న కళ్ళు పోగొట్టుకుని, దిక్కు తోచక, వూహ తెలియక అగమ్యగోచరంగావున్న స్థితిలో, అడవి వీరుల కంటబడి, రక్షింపబడతాడు. తన్ను కాపాడినవారి దరినుండి ఆ పసివాడు దూరంగా పారిపోతాడు. వాడ్ని పట్టి, కొట్టి, స్తంభానికి కట్టి అమ్మవారికి బలియివ్వడానికి ఉపక్రమించారు. ఆ గూడెపు వాసులు. వరుల గుణాన్ని గూర్చి అడవి వీరుడు, వనిత ఒక బాణం విసిరారు ఏమని?

అతను: మంచి యున్నదే కానరాదు
యీ మనుషులలోనా....
ఆమె: నీతి అన్నదే లేనేలేదు
మనసులలోనా......

అంటూ వెర్రి ఆవేశంతో పాడసాగారు. ఈ పాటను కొసరాజు వ్రాయగా, ఎస్. పి. బి. ఈశ్వరి పాడారు. సత్యం సంగీత సారధి. శ్రీ లక్ష్మి ప్రొడక్షన్స్ ఈస్ట్‌మన్ కలర్‌లో నిర్మించిన 'పాపం పసివాడు' చిత్రంలో పై దృశ్యం కనిపిస్తుంది. ఏ. పూర్ణచంద్రరావు నిర్వహణలో తయారైన యీ చిత్రానికి వి. రామచంద్రరావు దర్శకుడు. లక్ష్మి విడుదల.

## మల్లమ్మ కథలో
## కొసరాజు పాట

ఆర్. ఎస్. మూవీస్ నిర్మిస్తున్న 'మల్లమ్మ

(36వ పేజీ చూడండి)

# చిరంజీవి నాగేశ్వరరావు



స్వాగతం అందుకుంటున్న అక్కినేని. ('తాత—మనవడు' చిత్ర ప్రారంభోత్స సందర్భంగా స్వాగతమిస్తున్న నిర్మాత కె. రాఘవ.)

ప్రపంచంలో అనంతకోటి జీవరాసులు. అందులో ఎందరో మహానుభావులు. అసాధారణ ప్రజ్ఞావంతుల్ని మహానుభావులంటారు. అలాటివారిలో అక్కినేనిగారు ఒకరు.

ఈనెల 20కి, అక్కినేనికి 48 నిండాయి. నిజజీవితంలో 49 ని, సినీజీవితంలో 29ని ప్రవేశించారు. నాటి రంగప్రవేశం నుండి నేటి వరకు, ఆంధ్రుల అభిమాన కథానాయకుడిగా మన గలగడం అందరికీ సాధ్యమా? అక్కినేని ఎంత కృషి చేసియుంటే, ఎంత దీక్ష వూనియుంటే, ఎంత విశ్వాసం వుంచియుంటే అసాధ్యమయిన దాన్ని అధిగమించియుంటారు.

## గర్వకారణం ...

మన దేశం కన్న వుత్తమ కళాకారుల్లో నాగేశ్వరరావు ఒకరు. కృషితో నాస్తి దుర్భిక్షమ్ అన్న నానుడికి అక్కినేని జీవితమే ప్రత్యక్ష సాక్ష్యం. అక్కినేని నిర్వహించిన కొన్ని పాత్రలు మరెవ్వరూ చెయ్యలేనివిగా, కలకాలం మన మనస్సుల్లో నిలిచి పోయేవిగా, ఆ వేషాలకి ఆయన ప్రాణప్రతిష్ఠ చేశారు. అందుకే ఆయన్ని చిరంజీవి అని సంబోధించాను.

## భగవంతుడున్నాడు ...

నటసామ్రాట్ నాగేశ్వరరావుకు భగవంతుడిపై నమ్మకం లేదంటారు అందరు. అక్కడే పప్పులో కాలు వేస్తున్నారు. కొందరు భగవంతుణ్ని రాముడిలో, మరికొందరు కృష్ణుడిలో చూస్తారు. మన హీరో దేముణ్ని వృత్తిలో చూస్తూ, మురిసిపోతూ, భక్తితో కొలుస్తూ, తన ధ్యేయసాధనకు అవిరళ కృషి సలుపుతున్నారు.

## చదువు అడ్డుగోడ కాదు..

సంస్కారానికి, సరస్వతి అడ్డుగోడ కాదు అని నిరూపించిన వ్యక్తి. తనవశమైన లక్ష్మిని, సరస్వతీ పీఠాలకి, విద్యను వరంగా గొప్ప వ్యక్తులకు కైవశం చేసి విద్యాదానుడు అనిపించుకున్న అనమాన నటనా ధురీణుడే మన నాగేశ్వరరావు.

అక్కినేనిది విశాల హృదయం. ఆయన మనోభావాలు అంతకన్నా ఎన్నోరెట్లు విశాలంగా వుంటాయి. విగ్రహాలను ఆరాధించే పిచ్చి భక్తుడూ కాడు, దేముడనేవాడు వున్నాడా? అనెడి సందేహ ప్రాణి కాడు.

## వ్యవస్థ ...

ఇంతవాడు ఎంతవాడయినా, అహం, కోపం, గర్వం లాంటి దుర్గుణాలను తనచెంత రానివ్వక పోవడమే అక్కినేని ప్రత్యేకత. నాగేశ్వరరావును ఒక వ్యక్తి అనడం కన్నా వ్యవస్థ అనడం వుచితం.

## ఎవర్‌గ్రీన్ హీరో...

అక్కినేనిగారిని నమ్ముకుని, సినిమాలు నిర్మించిన వారిలో నూటికి ఎనభై మంది ధన విజయాన్ని, కీర్తి విజయాన్ని పొందియున్నారు. ఇప్పటికి 160 చిత్రాలు అయినాయి. అయినా, అప్పటిలాగే, యిప్పటికీ, ఎప్పటికీ ఎవర్‌గ్రీన్ హీరోగా వుండడం ఏ పూర్వజన్మసుకృత ఫలితమో గొప్ప వ్యక్తికి మాత్రమే సాధ్యపడుతుంది.

## సంస్కారి ...

తన్ను పొగిడినప్పుడు ఎంత సంతోషిస్తారో, తన్ను ఘాటుగా విమర్శించినప్పుడు అంత స్పోర్టివ్‌గా తీసుకుంటారు. ఇలాంటి సంస్కారం అందరికీ వుంటుందా?

## కామధేనువా ?

నిర్మాతల పాలిట కామధేనువా? అనిపిస్తుంది కదూ! ప్రేక్షకుల పాలిట పెన్నిధి అనిపిస్తుంది కదూ! పాత్రికేయులకు పరమ ఆప్తుడు అనిపిస్తుంది కదూ! అక్కినేనిగారిని గన్న తల్లి, తండ్రుల భాగ్యమే భాగ్యము. ఆయన్ని భర్తగా పొందిన అన్నపూర్ణమ్మ, ఆయన్ని తండ్రిగా బడసిన వారసులు ఎంతటి అదృష్టవంతులు.

## భాగ్యనగరం—చిత్ర రంగం!

భాగ్యనగరంలో చలనచిత్రరంగం అభివృద్ధి చెందడానికి ముఖ్యకారణం అక్కినేని ఆగమనం అనడం సమంజసం. ఆయన తన మకాంను మార్చడం అంటూ జరగకపోతే, బలమైన నిర్మాతలు హైదరాబాదుకు వచ్చేవారేనా? ఇంత ప్రగతి సాధించేదేనా? ఆయన్ను గూర్చి పిచ్చిపిచ్చిగా మాట్లాడిన ప్రబుద్ధులే యిప్పుడు హెచ్చు హెచ్చుగా మెచ్చుకుంటున్నారు. అందుకే అక్కినేనిని కార్యశూరుడు అంటున్నాను.

## చిరస్మరణీయుం ...

అక్కినేని ధరించిన దేవదాసును దిలీప్ చూచి ప్రశంసించి, ఆనందపారవశ్యంతో కౌగలించి ఏమన్నాడో తెలుసా? 'బ్రదర్. ముఝే బహుత్‌పసంద్ హాయ్' అని మెచ్చుకున్నారు. 'ప్రేమనగర్'ను శివాజీ వీక్షించి, ఏమని చెప్పాడో తెలుసా? 'నీ అరుమయాయిరుక్కిరదు. నీ రాయిగ' అన్నారు.

## ప్రపంచ యానం ...

అక్కినేని హైద్రాబాదుకు మకాం మార్చ బోతున్న సమయాన అమెరికా ప్రభుత్వం తమదేశం పర్యటించవలసిందిగా ఆహ్వానం అంపింది. అక్కడ ఒక మండలం పర్యటించి వచ్చారు. 'నేను చూచిన అమెరికా' పుస్తకాన్ని రచించారు. ఇటీవలం రష్యా దేశం పంపిన ఆహ్వానాన్ని అందుకుని, అచ్చట పక్షం రోజులు వుండి వచ్చారు. అక్కడి అనుభవాలను అనేక పత్రికల ద్వారా వివరించారు. అమెరికా

చిత్రాల విజయానికి కారణకర్త అయ్యాడు. రష్యాలో పర్యటన అనుభవాలను సమన్వయపరుస్తూ ఒక గ్రంథాన్ని వ్రాయ్యాలనుకుంటున్నారు.



'బడిపంతులు'లో రామారావు, రాజ్‌బాబు, అంజలీదేవి.

## సంఘంలో గుర్తింపు ...

సినిమా నటుడంటే కేవలం రంగు పూసుకునే వాడు, అనేదిభావం ఒకప్పుడు వుండేది. అది శుద్ధ తప్పు, సినిమానటులు సాంఘికప్రయోజకులు, వాళ్ళకి సమాజంలో విలువ, మర్యాద వున్నాయి అని అక్కినేని నిరూపించారు. ఎలాగని మీరడగవచ్చు. ప్రజలచేత సన్మానాలనందుకున్న, గండపెండేరాలు తొడిగించుకున్న, ఏనుగుపై వూరేగింపు చేయించు కున్న మొట్టమొదటి సినిమా నాయకుడు అక్కినేని గారే.

## దేశంకోసం ...

భారతదేశం క్లిష్టపరిస్థితుల్లో వున్నప్పుడల్లా, తను కష్టించి ఆర్జించిన దాంట్లో కొంతభాగాన్ని దానం చేసిన త్యాగమూర్తి మన అక్కినేని. అనేక విద్యాసంస్థలకు ధనదానం చేసి, తనకు అబ్బని చదువుకు గురుదక్షిణ చేసిన సరస్వతీ భక్తుడు మన అక్కినేని

## మరువ లేనివి ...

అక్కినేని ధరించిన 'విప్రనారాయణ, అర్ధాంగి కన్నతల్లి, దైలామజ్ను, కాళిదాసు, మాయాబజారు, మిస్సమ్మ, అనార్కలి, ధర్మదాత, భూకైలాస్, ఇద్దరుమిత్రులు, బుద్ధిమంతుడు, దసరాబుల్లోడు' చిత్రాల్లోని పాత్రలు మనం మరువగలమా? మరొకర్ని ఆ పాత్రల్లో చూడగలమా?

నాగేశ్వరరావు మన దక్షిణభారత నాయికలందరి సరసన నటించారు. ఒక్కొక్క సీజన్‌లో ఒక్కొక్క నాయికతో యీయనకు జోడుగా వుండి, అనేక

## చిరంజీవి
## పాత, కొత్తల సమన్వయం

పాతవాళ్ళకి కొత్తగా, కొత్తవాళ్ళకి పాతగా తన నటజీవితాన్ని సమన్వయ పరచుకుంటూ, జీవిత యాత్రను సాగిస్తున్నాడు, అక్కినేని. అందుకే ఆయన్ని గమ్యం తెలియని యాత్రికుడు అంటున్నారు.

## సంతృప్తి జీవితం ...

మనిషికి, మానవత్వానికి విలువనిచ్చే వ్యక్తి. మనస్సు, మమత వున్నవ్యక్తి. పెద్దల ఎడ భక్తి, పిన్నల ఎడ అనురక్తి వున్న వ్యక్తి. సంతృప్తిని వరంగా గన్న వ్యక్తి. నిత్యనూతనంగా, కాలానుగుణంగా నటించే శక్తిని బడసిన వ్యక్తి. పేరుకి 49వచ్చిందే గాని, 29 అంటే నమ్మరా, మీరు?

—శ్రీనివాస్

## సినిమా-
(32వ పేజి తరువాయి)

కథ' నగం చిత్రం తయారైంది. కృష్ణ—శారద దంపతులుగా నటిస్తున్న యీ చిత్రానికి అక్కినేని సంజీవి దర్శకుడు. ఇటీవల కొసరాజు వ్రాసి, కోదండపాణి సంగీతం సమకూర్చి, బాలసుబ్రమణ్యం పాడిన పాటను హీరో కృష్ణపై, మద్రాసుకు 30 మైళ్ళ దూరానవున్న దండిమెట్టు గ్రామంలో చిత్రీకరించారు.

'తొలివాన కురిసింది
తొలకరి వచ్చింది'

అనేడి యీ పాటలో కృష్ణతోబాటు మరికొందరు పాల్గొన్నారు. ఈ చిత్రంలో రామకృష్ణ, విజయలలిత, ప్రభాకరరెడ్డి, రాజబాబు, రమాప్రభ, నాగయ్య, హేమలత, రాధాకుమారి, బాలయ్య, లీలారాణి, రమాదేవి ముఖ్య పాత్రధారులు. గెస్టు వేషాల్లో గుమ్మడి, సత్యనారాయణ కనిపిస్తారు. లక్ష్మి విడుదలచేసే యీ చిత్రానికి కె. వెంకట్రామయ్య నిర్మాత.

## 'సంస్కార'కి బహుమతి

లొకార్నాలో జరిగిన ప్రపంచ చిత్ర ఉత్సవంలో 'సంస్కార' చిత్రానికి కాంస్య విగ్రహం బహుమతిగా లభించింది.

## కలర్ ఫిలిం కొరత

మద్రాస్‌లో ఆర్వో కలర్ పాసిటివ్ ఫిలిమ్ దొరకడం కష్టంగా వుంది. బొంబాయిలో కూడా యిదే పరిస్థితి యేర్పడింది. ఆర్వో ఫిలిం ఉత్పత్తిదారులు, తమవద్ద స్టాక్ లేదని ప్రకటించారు.

—శ్రీనివాస్



[illegible]లో వెవిరాణి, కృష్ణంరాజు




కాలేజీనుండి బయటికి వచ్చాను.

చాలా అలసటగా వుంది.

ప్రాక్టికల్స్ కుదరక చిరాగ్గా కూడవుంది.

మెల్లిగా బస్‌స్టాండ్‌కు వచ్చి నిలబడ్డాను.

ఏంటో ఈ జీవితం!?

ఎందుకీ చదువులు? దేన్ని వుద్ధరించడానికి?? ఈ ప్రాక్టికల్స్, ఈ రికార్డ్ బుక్స్ నాకు జీవితంలో ఎంతవరకు వుపయోగపడుతుంది? కేవలం ఆర్థిక స్వాతంత్ర్యం, పేరు ప్రతిష్టలుంటే సౌతిక మైనవే తప్ప, మానసికంగా, లౌకిక దృష్టికి అతీతమైన ప్రయోజనం ఈ చదువులో లేదనుకొంటుంటే ఏంటో, శూన్యంగా, వెలితిగా వుంది మనస్సులో.

నేను బి. ఎస్‌సి చదివేరోజుల్లో మా లెక్చరర్ ఎప్పుడూ చెప్పేవారు జీవితానికి, చదువుకీ సంబంధంలేదని. ఎలాంటి మనిషి నయినా — ఏటువంటి చెడ్డవాడినయినా, ఎప్పుడో ఒకప్పుడు—ఒక మంచిమాట కరిగించే మార్పుని ఈ పుస్తకాలు, ప్రాక్టికల్స్, ఈ సైన్సు ఏవిధంగా కూడ మార్చలేవని అనేవారు.

ఈమాట నిజమేనా?

గుండెల్లో ఎక్కడో—ఏమూలో నిరాశ, నిర్లిప్తత. చల్లగాలి మెల్లగా తట్టి లేపింది నన్ను. కొన్ని నెలల్లో కాబోయే పోస్టుగ్రాడ్యుయేటుని నేను. ఇన్నిరోజులు— కాదు, కాదు—నాకు జ్ఞానం తెలిసిన ఈ పదిసంవత్సరాలుగా చదువు తప్ప జీవితానికి ఇంకే ధ్యేయం, దీక్షలేదని భావించే నాలో ఇలాంటి ఆలోచనలు రేగుతున్నందుకు లోలోపలే నవ్వుకున్నాను.

ఇంకా బస్సు రాలేదు.

నాలో చిరాకు ఇంకొంచెం ఎక్కువయింది. చలిగాలి చిరుజల్లుగా మారింది. బస్‌స్టాండులో కొంచెం ఒదిగి నిల్చున్నాను. ఎదురుగా వెళ్తున్న కార్లను, వాన చినుకులను మెత్తగా తుడుస్తున్న వైపర్స్‌ని చూస్తూ, ప్రొద్దున్న పాడుచేసిన ప్రాక్టికల్స్‌నిగూర్చి ఆలోచిస్తున్నాను.

'అమ్మా.'

ఉలిక్కిపడి ప్రక్కకి చూశాను.

'ఎస్.ఎస్.ఎల్.సి పరీక్షకి ఫీజు కట్టాలమ్మా! ఏదన్నా సాయం చేయండి. దయానేసి ఎంతయినా ఇవ్వండమ్మా!'

ఐదు అడుగులు ఎత్తు, మాసినపొడుగులాగు, చొక్కాతో నా ప్రక్కన నిలబడి ప్రపంచంలోని దిగులునంతా కళ్ళల్లో ప్రోగుచేసికొని అడుగుతున్న ఆ కుర్రవాడిమాటలు నాలో ఏలాంటి స్పందనని కలిగించలేదు. ఎవరయినా సరే—దీనంగా నా ముందు చేయి జాపితే అప్రయత్నంగా పర్సులోకి చేయిని జార్చే నేను—ఆరోజు ఆ కుర్రవాడి మాటలు యాంత్రికంగా వింటూ నిలబడ్డాను.

'అమ్మా!' ఆ పిలుపులో దీనత్వం — అభ్యర్థన—అసహాయత్వం.

అవి గుర్తించినా, నిర్లక్ష్యంగా వీటో చూస్తూ వుండిపోయాను.

'చదువుకునే మీలాంటివాళ్ళే, చదువుకోవాలనుకొనే నాలాంటి వాళ్ళకి సహాయం చేయకపోతే ఎలాగమ్మా! దయచేసి...'

'చాల్చాలేవయ్యా! నీ దొంగమాటలు, నువ్వూను. ఈ విధంగా చదువు— చట్టుబండలంటూ గౌరవంగా భిక్షమెత్తుకోవడం యీ రోజుల్లో ముష్టివాళ్లకికూడ ఒక ఫ్యాషనయిపోయింది. చదువుకోవాలట. చదివి వీర్ని ఉద్ధరిస్తావ్?' నాముందు నిలబడివున్న ఒక పెద్దమనిషి ఆ కుర్రవాడ్ని చూస్తూ చీత్కారించారు.

'నిజమే. నేను మాత్రం చదివి వీర్ని వుద్ధరించాలి? కొన్నివేలమంది సంవత్సరానికి పుట్టుకొస్తున్న పోస్టుగ్రాడ్యుయేటుల్లో నేనొకదాన్ని. అంతే.'

'అమ్మా!' మళ్లీ ఆ పిలుపులో అవే అర్థాలు, అవే భావాలు.

'ఏంటి? ఏం కావాలి? నా దగ్గర యిప్పుడేంలేదు' విసుగ్గా పలికింది నాకంఠం.

'అలాగనకండమ్మా! రేపే జీతంకట్టాలి. చదువంటే నాకెంతో ఆసక్తమ్మా!' ఆ కుర్రవాడు ఏదో మాట్లాడుతునేవున్నాడు. ఇంతలో నిండు గర్భిణిలా, క్రిక్కిరిసిన జనంతో బస్సు వచ్చి నిలబడింది.

బస్సుని చూసిన తొందరలో వాడిమాట లేవీ వినిపించుకోకుండా, అతిప్రయత్నంమీద బస్సు ఎక్కేశాను.

నెమ్మదిగా — మనుష్యుల్ని త్రోసుకొంటూ ఒక ప్రక్కగా నిలబడడానికి చోటు సంపాదించాను. నేనుకూడ జీతం కట్టడానికి యీరోజే డబ్బు తెచ్చాను. కాని ప్రాక్టికల్స్ గొడవలోపడి ఆమాటే మరచిపోయాను.

నాక్కూడ రేపే ఆఖరిరోజు జీతం కట్టడానికి. నేను— ఆ ముష్టికుర్రవాడు యిద్దరం జీతం విషయంలో ఒకే పరిస్థితిలో వున్నాం.

వాడిది చదువే— నాది చదువే.

నేను ఆడదాన్ని— వాడు మొగవాడు.

నాది పోస్టుగ్రాడ్యుయేటుకోర్సు—వాడు ఎస్.ఎస్.ఎల్.సి కాని—భగవంతుడు ఆర్థికంగా, సాంఘికంగా మా యిద్దరికీ కలిగించిన భేదం మాత్రం ఎంత విచిత్రమైనది!!

ఇంతలా ఆలోచించే నేను వాడడిగిన దేదో ఎందుకివ్వలేకపోయాను?

వాడు కట్టాల్సిన మొత్తం జీతం యిచ్చినా, యీ షణ్మాత్రంకూడ యిబ్బంది పడల్సిన ఆర్థిక పరిస్థితికాదు మాది.

అలాంటప్పుడు ఎంతైనా యివ్వండమ్మా అన్న వాడిమాటలకు కనీసం రెండురూపాయలుకూడ ఎందుకివ్వలేకపోయాను.

అవును ఎందుకు—ఎందుకివ్వలేకపోయాను?? అంతటి లోభినా?

కాదు—కాదు— మరి???

అనవసరం అనిపించిందేమో!

ఊహు, యిక్కడ అనవసరం— అవసరం అన్న ప్రసక్తే లేదు. నాకివ్వాలని అనిపించలేదు. అంతే. మరే కారణంలేదు. ఎన్నోసార్లు ఎంతోమందికి యిచ్చాను. అలాగే కొంతమందికి కొన్నిసార్లు యివ్వలేదు. అందులో సిద్ధాంతం కాదు.

'టికెట్ ప్లీజ్.'

రెండోసారి ఉలిక్కిపడ్డాను.

ఎదురుగా కండక్టరు!

'నువ్వు చాలా సెన్సిటివ్‌వాలూ! ప్రతి చిన్న విషయాన్ని గురించి అందులో ఎలాంటి ప్రయోజనం లేకపోయినా, గంటల తరబడి ఆలోచిస్తావ్. 'ఆలోచనలు' అన్న సబ్జక్ట్ అంటూ పెడ్తే అందులో మొదట నీకే వస్తుంది డాక్టరేట్' అనే పార్వతి మాటలు జ్ఞాపకానికి వచ్చి, మెల్లగా నవ్వుకుంటూ, పర్సుకోసరం చేతిలోని పుస్తకాలని గుండెలదగ్గిరకు తెచ్చాను.

గుండె గతుక్కుమంది!!

పిచ్చిగా కండక్టర్ వైపు చూసాను.

'నా పర్సు' అప్రయత్నంగ వెలువడింది నా నోటినుండి యీ పొడిమాటలు.

'ఏముందమ్మా!' కండక్టరు కొంచెం కంగారుగా అడిగాడు.

'నా పర్సుపోయింది' నీరసంగా, అయోమయంగా అన్నాను.

ఏంటో గందరగోళంగా వుంది మనస్సు మెదడు, పర్సులో రెండువందలపైనవుంది ఫీజుకి, ఏవో పుస్తకాలకి కలిపి.

ఎస్. ఎస్. ఎల్. సి ఫీజు దానం చేయగల స్థితిలోవున్నా; రెండువందల రూపాయలు పోగొట్టుకుంటే తేలిగ్గా తీసుకొనే ఆర్థికపరిస్థితిమాత్రం మాది కాదని నిశ్చయంగా చెప్పగలను.

'ఎక్కడ పడేశావు? ఎంత డబ్బువుంది?' ఇలాంటి ప్రశ్నలు బయలుదేరాయి బస్సులో.

'ఎక్కే తొందరలో సమయం చూసి, ఆ భిక్షగాడు కొట్టేసి వుంటాడు. వాడి దొంగచూపులు, వాడ్ని చూస్తుంటే నాకు అప్పటినుండే అనుమానంగా వుంది' బస్‌స్టాండ్‌లోని పెద్దమనిషి, బస్సులో మిగతా వాళ్ళతో అంటున్నాడు.

పర్సులోని డబ్బు విన్నతర్వాత కండక్టరు బస్సుని ఒక ప్రక్కగా ఆపుచేయించాడు. ఇంతసేపు అవసరం — అనవసరం అన్న ఆలోచనే లేక అనేకరకాలగా ఆలోచించిన నేను—యిప్పుడు ఆలోచించాల్సిన అవసరం యేర్పడేటప్పటికి, ఏం ఆలోచించాలో, ఎలా ఆలోచించాలా తెలియక—శక్తిలేక స్తబ్దుగా నిలబడిపోయాను...

'అమ్మా! అమ్మా!' ఏదో పిలుపు.

ఆ పిలుపులో ఆరాటం, ఆత్రుత!

చిన్నగ వెనక్కు తిరిగి బస్సు అద్దంలోనుంచి చూశాను.

బస్‌స్టాండులోని కుర్రవాడు! ఒగర్చుకొంటూ పరుగెత్తుకొని వస్తున్నాడు. వాడిచేతిలో నా పర్సు!!

గబగబా అందర్నీ త్రోసుకొని, ఒక్క అంగలో బస్సు దిగి, వాడ్ని కభిముఖంగా రెండడుగులు వేశాను.

'అమ్మా! మీరు బస్సు ఎక్కుతూంటే పర్సుజారి క్రిందపడిపోయింది. మీరు చూసుకోలేదు. నేను పిలుస్తున్నా వినిపించుకోలేదు. ఇంతలో బస్సుకదిలి వెళ్ళిపోయింది. అందుకని బస్సు వెనుకనే పరిగెత్తుకొంటూ వచ్చాను' ఒక ప్రక్క ఆయాసంతో ఎగశ్వాస పీలుస్తున్నా — గబగబా మాట్లాడేశాడు.

నెమ్మదిగా పర్సుతీసుకొంటూ వాడి కళ్లల్లోకి చూశాను.

ఎలాంటి వికారం లేకుండా నా కళ్ల

# ఆంధ్రసచిత్రవారపత్రిక

# డిటెక్టివ్ నవలల పోటీ!

## ఉత్తమ రచనకి

## రు. 1,116 బహుమతి

*డిటెక్టివ్ నవలా రచయిత(త్రు)లకి మంచి అవకాశాన్ని, ప్రోత్సాహాన్ని కలిగించడానికి ఈపోటీ నిర్వహిస్తున్నాము. పోటీలో ఉత్తమ నవలగా ఎన్నికైన రచనకి రు. 1,116 లు బహుమతి యిస్తాము. రచయిత(త్రు)లందరూ ఈ అవకాశాన్ని వినియోగించుకుని పోటీలో పాల్గొని దీనిని జయప్రదం చెయ్యాగలరని ఆశిస్తున్నాము.*

## నిబంధనలు

1. పోటీకి పంపే నవలలు 75 అరఠావు (ఎక్సర్‌సైజు నోట్‌బుక్ పేజీకి రెట్టింపు) పేజీలకి మించి ఉండరాదు. కాగితానికి ఒకవైపునే సిరాతో రాయాలి.

2. రచనలు వాస్తవానికి దగ్గరగా ఉండి, తెలుగుదనం నిండి ఉండాలి. స్వంతరచనలు తప్ప అనువాదాలు, అనుసరణలు అయి ఉండకూడదు. ఇంతకుముందు ప్రచురణ అయి ఉండ కూడదు.

3. నవల తమ స్వంత రచనేనని దేనికీ అనుసరణకాని, అనువాదం కాని కాదని రచయిత(త్రి) హామీ రాసి పంపాలి. ఈ హామీలు నవల వ్రాత ప్రతిమీదే రాసి ఉండాలి. హామీలేని రచనలు పోటీకి అంగీకరింపబడవు.

4. నవల వ్రాతప్రతిమీద, కవరుమీద, 'డిటెక్టివ్ నవలలపోటీకి' అని స్పష్టంగా రాయాలి. రచయిత (త్రి) పేరు, చిరునామా కూడా వ్రాతప్రతిమీద స్పష్టంగా రాయాలి.

5. రచనలని 'సంపాదకుడు, ఆంధ్ర సచిత్ర వారపత్రిక, 7, తంబుచెట్టి స్ట్రీట్, మదరాసు—1కి' పంపాలి. వ్యక్తుల పేర పంపరాదు.

6. ఉత్తమ రచనకి సంబంధించిన తుది నిర్ణయం ఆంధ్ర సచిత్ర వారపత్రిక సంపాదకునిదే. ఈ విషయమ్మై ఎలాంటి ఉత్తర ప్రత్యుత్తరాలు జరుపడానికి వీలులేదు. పోటీకి సంబంధించిన ఏ విషయం గురించి ఉత్తర ప్రత్యుత్తరాలు జరిపే అవకాశం లేదు.

7. బహుమతి పొందని నవలల వ్రాత ప్రతులని మేమే తిప్పి పంపే ఏర్పాటు చేస్తాము. కాని వాటివిషయంలో మేము ఎలాంటి బాధ్యతనీ స్వీకరించలేము. రచయిత(త్రు)లు తమరచనలతో పాటు, తగినన్ని స్టాంపులు అతికించిన స్వంత చిరునామా కల కవర్నని జతపరచనవసరం లేదు.

8. పోటీకి గడువు తేది 30—9—1972. ఆ తర్వాత మా కార్యాలయం చేరిన రచనలు పరిశీలించడం జరుగదు.

9. పోటీలో బహుమతి పొందిన డిటెక్టివ్ నవల ప్రచురణ 1973 సంక్రాంతి సంచికలో ప్రారంభిస్తాము.

## ముగింపు తేదీ 30-9-1972

రచయిత(త్రు)లందరూ మాతో సహకరించి ఈ పోటీని జయప్రదం చెయ్యవలసిందిగా కోరుతున్నాము.

## నగ్నసత్యం

ల్నాకి చూస్తున్నాడు వాడు.

నిజం — నా చదువెంత గొప్పది?

వాడి సంస్కారమెంత చిన్నది?

అందరి దృష్టిలో నేనొక పొస్టుగ్రాడ్యుయేటుని. కాని – ప్రపంచం దృష్టిలో, ఒక విధంగా నా దృష్టిలోకూడ భారతదేశంలోని వేలాదిమంది ముష్టివాళ్లలో వీడొకడు.

రెండువందలు నా పర్సులో మూలుగుతున్నా, రెండురూపాయలు యివ్వడం అనవసరమనిపించింది నాకు.

చేతిలో రెండు పైసలు లేకపోయినా, రెండువందల్నీ నా కప్పగించడం అత్యవసరంగా భావించాడు వాడు.

బస్సులో ప్రయాణించినంత సేపు నా చదువు, నా పరిస్థితులతో వాణ్ని కొలిచిన నేను - నిజానికి వాడిముందు నేనెందులో కొరతపడ్డానో స్పష్టంగా యిప్పుడు తెలిసింది. బస్సులో ఆలస్యానికి కలవరం బయలు దేరింది.

'పర్సు దొరకడం మీ అదృష్టం. ఇక రండమ్మా!' అంటున్నాడు కండక్టరు.

వాడి చేతిని అంటీ అంటనట్లు ముట్టుకొని బస్సువైపుకి నడిచాను.

ఉన్నట్టుండి వెనక్కి తిరిగి చూశాను.

నేను చేయనివనికి వాడికళ్లు కాంతితో మెరుస్తున్నాయి.

పర్సు తెచ్చినందుకు ప్రతిఫలాన్ని యిచ్చి వాడి సంస్కారాన్ని కించపరచని సంస్కారం నాలో వాడ్ని చూపిన తర్వాతైనా మేల్కొన్నందుకు నా మనస్సు తృప్తిగా మూలిగింది.

వాడి కళ్లల్లోని కాంతికి అర్థం అదే; ఆ అర్థాన్ని అర్థంచేసుకొన్న నేను— పొస్టుగ్రాడ్యుయేటుని ధన్యురాల్ని.

బస్సు— అనేకరకాల వినుత్నాలు చేస్తున్న మనుష్యులని మోస్తూ కదిలింది.

ఇప్పుడు కూడ జీవితానికి, చదువుకి సంబంధం లేదనే మా లెక్చరర్ మాటలు నా చెవుల్లో గింగురు మంటున్నాయి.

అవును — చదువుకి, సంస్కారానికి నింగికీ నేలకి వున్నంతదూరం.

నిజం— ఇది నగ్నసత్యం!!! ●

# వారఫలం

**29-9-1972 శుక్రవారం మొదలు**
**5-10-1972 గురువారం వరకు**

**మేషం:** వృత్తిలో పోటీవారి పోటీ తగ్గుతుంది. ప్రయాణాలు ఫలిస్తాయి. మీ మంచితనమే మీకు ఇబ్బందిని కలిగిస్తుంది. ఉద్యోగంలో గౌరవం లభించ గలదు. వారం ఆఖరులో వ్యాపారంలో ఆదాయం పెరుగుతుంది. మిత్రుల సహాయం లభిస్తుంది.

స్త్రీలకు:— ఆరోగ్యం బాగుంటుంది. సాహిత్య కళారంగాల్లో ఖ్యాతి లభిస్తుంది.

**వృషభం:** ప్రయోజనం గల పరిచయాలు యేర్పడతాయి. నూతన వ్యవహారాలు లాభిస్తాయి. సాహసముతో గూడిన వ్యవహారాలు బాగుంటాయి. సజ్జన సాంగత్యం లభించ గలదు. వారం ఆఖరులో అన్ని వ్యవహారాల్లోను ఫలితం సామాన్యంగా ఉంటుంది.

స్త్రీలకు:— కుటుంబ వ్యవహారాలు బాగుంటాయి. పుణ్యకార్యాలు చేస్తారు.

**మిథునం:** మీ కార్యక్రమాలు బాగుంటాయి. ఉద్యోగంలో గౌరవం లభిస్తుంది. రావలసిన డబ్బు సమయానికి అందుతుంది. విద్యావైజ్ఞానికరంగాల్లో మీ కృషి రాణిస్తుంది. రాజకీయ వ్యవహారాల్లో మీ ప్రయత్నాలు ఫలిస్తాయి.

స్త్రీలకు:— ఆరోగ్యం బాగుంటుంది. సంతోషకరమైన వార్తలను వింటారు.

**కర్కాటకం:** అనవసరమైన శ్రమ కలుగుతుంది. వృత్తిలో చికాకులు యేర్పడతాయి. వారం మధ్యలో అన్ని వ్యవహారాలు బాగుంటాయి. ప్రయాణం ద్వారా కార్యసాధన చేయగలరు. భాగస్వాములతో కలసి చేసే వ్యాపారాలు బాగుంటాయి.

స్త్రీలకు:— కుటుంబ వ్యవహారాలు బాగుంటాయి. అధిక వ్యయం జరుగుతుంది.

**సింహం:** వ్యాపారంలో మీ ప్రయత్నాలు ఫలిస్తాయి. ఆర్థిక వ్యవహారాలు బాగుంటాయి. వారం మధ్యలో వ్యతిరేక పరిస్థితి యేర్పడుతుంది. మీ తాలూకు వస్తువులు పోవచ్చును. వారం ఆఖరులో వృత్తి వ్యాపారాలు బాగుంటాయి. ఉద్యోగంలో గౌరవం లభిస్తుంది.

స్త్రీలకు:— ఆరోగ్యం బాగుండదు. సాహిత్య కళారంగాల్లో ఖ్యాతి లభిస్తుంది.

**కన్య:** అన్ని వ్యవహారాల్లోను గౌరవం బాగుంటుంది. ప్రయాణాలు అనుకూలంగా ఉంటాయి. సాహసముతో గూడిన వ్యవహారాలు లాభిస్తాయి. వృత్తిలో నూతనావకాశాలు లభిస్తాయి. వారం ఆఖరులో మీ తాలూకు మనుష్యులే మిమ్మల్ని వ్యతిరేకిస్తారు.

స్త్రీలకు:— కుటుంబ వ్యవహారాల్లో శ్రమ కలుగుతుంది. దైవకార్యాలు నెరవేరతాయి.

**తుల:** వృత్తిలో నూతనావకాశాలు లభిస్తాయి. మిత్రులకు సహాయం చేస్తారు. స్థిరాస్తి వ్యవహారాలు బాగుంటాయి. వ్యాపారంలో ముఖ్యమైన వ్యక్తులను కలుసుకొంటారు. సాహసముతో కూడిన వ్యవహారాలు లాభదాయకంగా ఉంటాయి.

స్త్రీలకు:— ఆరోగ్యం బాగుంటుంది. విలాస వస్తువులు కొంటారు.

**వృశ్చికం:** ఉద్యోగంలో యెవరినీ విశేషంగా నమ్మడం తగదు. ప్రయాణాలు వాయిదా పడతాయి. వారం మధ్యలో వృత్తి వ్యాపారాలు బాగుంటాయి. నూతన వ్యవహారాలు లాభిస్తాయి. ప్రయోజనంగల పరిచయాలు యేర్పడతాయి.

స్త్రీలకు:— అనవసరమైన వ్యయం చేస్తారు. వినోద కాలక్షేపాల్లో పాల్గొంటారు.

**ధనుస్సు:** ప్రయత్నించిన ప్రతిపనీ సులువుగా నెరవేరుతుంది. నూతన వ్యవహారాలు లాభిస్తాయి. వారం మధ్యలో చికాకులు యేర్పడతాయి. సాహసముతో కూడిన వ్యవహారాల్లో నష్టం వస్తుంది. వారం ఆఖరులో అన్ని వ్యవహారాలు అనుకూలంగా ఉంటాయి.

స్త్రీలకు:— ఆరోగ్యం బాగుండదు. అలంకార వస్తువులు కొంటారు.

**మకరం:** వ్యాపారంలో శ్రమ మీద అనుకూలత లభిస్తుంది. పోటీవారితో వాద ప్రతివాదాలు తగవు. ప్రయాణాలు ఫలిస్తాయి. మీ ఆలోచనలు లాభదాయకంగా ఉంటాయి. వారం ఆఖరులో చేజిక్కిన అవకాశాలు కూడా జారిపోవచ్చును.

స్త్రీలకు:— కుటుంబ వ్యవహారాలు బాగుంటాయి. దైవకార్యాలు నెరవేరతాయి.

**కుంభం:** మీ కార్యక్రమాలు ప్రోత్సాహకరంగా ఉంటాయి. సాహసముతో కూడిన వ్యవహారాలు బాగుంటాయి. రాజకీయ వ్యవహారాల్లో శ్రమ కలుగుతుంది. అనవసరమైన సందేహాలు కలుగుతాయి. రావలసిన డబ్బు సమయానికి అందుతుంది.

స్త్రీలకు: — ఆరోగ్యం బాగుంటుంది. సంతానానికి సౌఖ్య సంతోషాలు లభిస్తాయి.

**మీనం:** అన్ని వ్యవహారాల్లోను ఫలితం స్వల్పంగా ఉంటుంది. ఆర్థిక వ్యవహారాల్లో మొగమాటాలు తగవు. వారం మధ్యలో నూతన వ్యవహారాలు లాభిస్తాయి. విద్యావైజ్ఞానికరంగాలలో ఖ్యాతి లభిస్తుంది. వారం ఆఖరులో యితరుల నిమిత్తం శ్రమకు గురి కాగలరు.

స్త్రీలకు:— పోటీవారిలో గౌరవం బాగుంటుంది. ఆడంబరం కోసం వ్యయం చేస్తారు.

—మహేష ●

సీరియల్

# ఆకాశదీపాలు

పాలకోడేటి సత్యనారాయణరావు

### జరిగిన కథ

కాలేజీ ఎలక్షనులో పోటీచేస్తుంది శారద. విశ్వనాథరావును ప్రేమిస్తుంది. తను వ్రాసిన కథ చదవమని శారదకు ఇస్తుంది తల్లి. రామచంద్రయ్య కూతురు ఇందిర రిటైర్డు జడ్జీగారబ్బాయి రాంబాబును ప్రేమిస్తుంది. ఇందిరతో స్నేహం, తగ్గించుకోమని రాంబాబు తండ్రి చెప్తాడు. కాని అప్పటికే వాళ్ళిద్దరూ ఒకటయ్యారన్న సంగతి ఆయనకు తెలియదు. ఇందిర ఆ సంగతి సుందరికి తెలియపర్చాలని అనుకుంటుంది. తనలో చెలరేగే ఆందోళన సుందరికి ఎలా చెప్పాలో తెలియలేదు ఇందిరకి. చివరికి సుందరికి ఉత్తరంద్వారా తెలియ పర్చింది.

## 7

ఇందిరకు ఆడపిల్ల పుట్టిన నాటికి వారంరోజులయింది. ఇందిర ప్రత్యేకంగ కోరుతూ ఉత్తరం రాసింది సుందరికి— 'నీకెంత అసహ్యం ఉన్నా, ఆప్యాయత ఉన్నా, తప్పకుండా రా! వచ్చి ఈ గండంనుంచి నన్ను తప్పించు! బతుకుతాననే ఆశకన్నా చచ్చిపోతాననే నమ్మకమే నాలో చాల ఎక్కువగ ఉంది. బహుశా అలాగే జరుగుతుందేమో! అలా జరిగితే మంచిదేగాని, నిన్ను చూడకుండా చావను, చావలేను. అందుకోసం తప్పక రా!' అంటూ.

తిరుగు టపాలో సుందరే వచ్చింది. తనూ ఉత్త మనిషి కాకపోయినా, ఇందిరకు సాయపడాలనే కాంక్ష తనలో అణువణువుగా ఆక్రమించి ఉండటంచేత, గత్యంతరం లేక వచ్చింది సుందరి.

'నీకు అనవసరమైన శ్రమ తల్లీ—' అన్నాడు రామచంద్రయ్య సుందరి రాగానే.

'అదేమిటి బాబాయ్‌గారూ, మీకు నేను వేరు, ఇందిర వేరన్నమాట! ఈమాట నాకు తెలిసి ఉంటే రాకేపోదును... పోనీ లెండి, ఇప్పుడుమాత్రం ఏం? రేపు వెళ్ళిపోతాను.'

రామచంద్రయ్య బాధపడుతూ అన్నాడు. 'కాదు తల్లీ, అలా అనికాదు, నీకెందుకీ శ్రమ అని! అంతేగాని, నాకు ఇందిరకన్న నీవే ఎక్కువ అన్న సంగతి నీకు తెలిందిగాదు.'

సుందరి నవ్వింది 'అలా అన్నారంటేనే సరిపోదు. ఇపుడు — రేపు మీరు నన్ను 'పో' అని అన్నాగానీ పోతానా?'

'పో అని నేనంటానా? నీవు రావటమే నాకు మహద్భాగ్యం' అన్నాడు రామచంద్రయ్య.

ఏళ్ళ్ళతర్వాతనో తండ్రి అంత సంతోషంగ ఉండడం ఇందిరకు సంతోషాన్ని కలుగజేసింది. అయినా సంతోషం కలకాలం ఉండేదికాదు. సుందరి వెళ్ళిపోతేనే ...?

తన దురదృష్టానికి గురౌతుంది.

ఈ విషయం పచ్చి నిజం!!

ఆరోజు రాత్రి సుందరి రామచంద్రయ్యతో మాట్లాడింది — అసలు అలా అనటంకన్నా సుందరితో రామచంద్రయ్య మాట్లాడడంచేత సబబు. సుందరి తనకు రాంబాబు కనిపించినట్టు రామచంద్రయ్యకు చెప్పలేదు ఇందిర, అన్నది గ్రహించింది అప్పుడు. ఆ విషయం చెప్పాలో, లేదో నిర్ణయించుకొనేలోపునే, నోరుజారిపోయింది సుందరికి. రామచంద్రయ్య ముఖంలో కోపం, ద్వేషం కొంతసేపు తాండవించినా, క్షణంలో అంతా తమాయించుకొని అడిగాడు. 'రాంబాబా తల్లీ?' అని.

'ఔనండీ రాంబాబే!'

'ఏంచేస్తున్నాడమ్మా అక్కడ?'

'ఏమోనండీ తెలీదు. పక్కనే మాగారున్నారక్కడ. పలకరించటం బాగుండదని అనుకొన్నానుగానీ లేకపోతే. . . అయినా రాంబాబే పలకరిస్తాడనుకున్నా కాని, అతను నన్ను చూసినట్టు లేదు.'

'బహుశా చూసే పలకరించలేదేమో? ఎవరు చెప్పగలరు?'

'లేదండీ, రాంబాబుగురించి నాకు బాగ తెలుసు. అతను నన్ను చూసి ఉంటే తప్పక పలకరించి ఉండేవాడు.'

'అలా అనుకోకు తల్లీ — ఇంకా సంగతి తెలిసాక, ఏమాట అనుకోవడానికి కొంత ధైర్యం కావాలి.'

'మీరలా అనకండి, ఇంకొక సంగతి. అదే, ఆ సంగతి అతని కసలు తెలీదు. మీరు నమ్మండి. అతనికి అది తెలిస్తే, రెక్కలుగట్టుకొని వాలతాడు ఆక్షణంలోనే'

సుందరికి రామచంద్రయ్య పరిస్థితి చూస్తుంటే జాలివేస్తోంది—ఒక్కగానొక్క కూతురు. కని అపురూపంగ పెంచుకొన్న దానికి ఇదా శిక్ష? కోరిందల్లా ఇచ్చి, అమూల్యమైన స్వాతంత్ర్యాన్నికూడ ఇచ్చి కంటిలో పాపలా చూసుకొన్నందుకు కన్న కూతురు ప్రసాదించిన బహుమతి అవమానం అయితే, ఆ ముసలి ప్రాణం ఎంతలా గిలగిలలాడిపోయివుంటుందో ఊహించుకొంది సుందరి.

చాలసేపు మౌనంగ ఉండిపోయారు ఇద్దరూ.

నిశ్శబ్దాన్ని చీలుస్తూ అంది సుందరి 'బాబాయ్‌గారూ పోనీ ఒక పనిచేస్తే...?'

'చెప్పు తల్లీ!'

'మీరొకసారి హైదరాబాద్ వెళ్ళొస్తే రేమిటి?'

'ఎందుకమ్మా?'

'రాంబాబు కనిపిస్తాడేమోనని!'

'అంటే... నీది పిచ్చి! అంతేగాని, ఏదో ఒకరోజున చాల యాదృచ్ఛికంగ కనబడ్డ రాంబాబు మళ్లీ నాకాసటంలో కనిపిస్తాడనే నీ వూహ?'

'అలా అని కొట్టిపారెయ్యకండి! మానవ ప్రయత్నం మనం చెయ్యకుండా ఉండిపోవటం సైతం తప్పే అంటాను. మీరు ఊ అనండి, రేపే వెళుదురుగాని — వెళ్ళి ఆ చిక్కడపల్లిలో రెండురోజులు నిలబడితే, అతనే కనిపించకపోడు .... నాకా నమ్మకం ఉంది.'

రామచంద్రయ్య ఏమీ మాట్లాడలేదు— అది ఏమీ నిర్ణయించుకోలేని స్థితి. వెళ్ళి వెతికితే దొరుకుతాడా అనే సందేహం. దొరకకపోతాడా అన్న నమ్మకం ... వీటి మధ్య త్రిశంకుని స్వర్గంలా ఉంది అతని మనసు.

కొంతసేపు ఊరుకొని అంది సుందరి— 'నామాట వినండి బాబాయ్‌గారూ—మీరొక సారి వెళ్లిరండి. కనిపించి తీరుతాడనే నా నమ్మకం వృధా అయిపోదు... నాకోసం వెళ్ళండి.'

రామచంద్రయ్య ఏమీ అనలేదు. ఈసారి కూడా— ఆశ నిరాశలమధ్య ఊగిసలాడుతోంది అతని మనసు.

'మౌనం అంగీకార సూచకం. మీరు వెళ్ళ



టానికి ఒప్పుకోవ్వక్కే్గదా?'

రామచంద్రయ్య నిర్లిప్తంగా ఉండి పోయాడు.

'అయితే రేపు రాత్రికే నీ ప్రయాణం!'

క్షణం ఆలోచించి అడిగాడు సుందరిని ఇందిరకీ సంగతి చెబుతావనే అంటావా?'

'వద్దండీ, వద్దు—మీరు వెళ్ళిరండి. మీరు వెడతానంటే ఒప్పుకోకపోవచ్చు ఇందిర. వెళ్ళి వచ్చాక ఫలితాన్నిబట్టి ఆలోచిద్దాం.'

'ఏమో, తల్లీ! అంతా నీ మంచితనం వల్ల జరగాల్సిందే—'

రామచంద్రయ్యను మర్రోజు సాయంత్రం సంధి తొందర చేస్తోంది సుందరి. ఇందిర అడిగితే, సుందరి వచ్చింది కనుక ఒకసారి ఇంటికి వెళ్ళొస్తానన్నాడు. ఇందిర వద్దని అనలేకపోయింది.

ఆవకోసం తండ్రికెందుకు శిక్ష?

రాత్రి పదింటికి ఇంటిమంచి బయలు దేరిన రామచంద్రయ్య అరగంటలో తిరిగి వచ్చేశాడు—ఒక దుర్వార్త మోసుకొంటూ!

—శారద ఇల్లు కాలిపోయిందట! ఆ పిచ్చి పిల్లవల్ల!!—రాత్రి పదింటికి పైన అటకమీదున్న కాగితాలుతీసి చూద్దామనే ఊహతో అటకెక్కి, కిరసనాయిలు దీపంతో తిరుగుతూ, కిందబెట్టిన కాగితాలమీద కొంచెం కిరసనాయిలు ఒలికి, అంటుకొంది ఆ ఇల్లు—భయంతో కిందికికూడా దూక లేకపోయాడు అతడు—సజీవదహనం జరిగి పోయిందని ఆ పిచ్చివాడికి. బాగా కాలిపోయి హాస్పటల్‌లో చేరింది శారద.

—ఇదీ జరిగిన సంగతి.

ఆ కాలుతున్న ఇల్లు, కాలిపోయిన మనిషి శవం, సగం కాలిపోయిన శారదను చూసి ఇక వెళ్ళలేకపోయాడు రామచంద్రయ్య.

స్నేహితురాలి తండ్రి దహనం, స్నేహితురాలికి జరిగిన ఆ ఘోరం విని బాగ చలించి పోయింది ఇందిర. ఆరోజే వెళతానంది, శారదను చూడటానికి. సుందరి, రామచంద్రయ్య బాగ పట్టుపట్టటంతో వెళ్ళలేదు. అంత రాత్రివేళ.

—మరునాడు—

ఇందిర, సుందరి ఇద్దరూ హాస్పిటల్‌కు వెళ్ళారు—రామచంద్రయ్య వద్దు వద్దని ఎంత చెప్పినా వినకుండా—"మీరు ఉత్త మనుషులుకారు, ఇంత దారుణంగ కాలి పోయిన దృశ్యం మీరు చూడటం క్షేమం కాదు, వినండి నామాట— అని అన్నా వినకుండా వెళ్ళిపోయారు.

హాస్పిటల్లోకి వీళ్ళు వెళ్ళేసరికి స్పృహ తప్పిపోయిన శారద కనిపించింది వీళ్ళకు. వళ్ళంతా బాగ కాలిపోయింది. పచ్చగ పసిమి ఛాయతో ఆకర్షణీయంగావుండే ఆ యువతి, నల్లగా మాడిపోయి, కమిలిపోయి, బొబ్బలతో, చాల అసహ్యంగ ఉంది. దిక్కులేని సేవ కూర్చుందామనుకున్నా అసహ్యంవల్ల కూర్చోలేని స్థితి ఏర్పడుతోంది.

కొంతసేపట్లోనే డాక్టర్లు, నర్సులు, ఒకటే కంగారుపడటం ప్రారంభించారు. మందులు, మెడిసన్లు, డాక్టర్లు, నర్సుల్నీ అతనికి ఆక్సిజన్లూ, హైడ్రోజన్లూ... అంతా వేస్ట్—

చావాల్సిన శారదకు ప్రాణం పొయ్యలేక పోయాయి ఇవేవి!

ఇంతమంది ఉన్నా ఇంత దారుణంగ చావాల్సి ఉంది శారద!! అందరూ చూస్తూ ఉండగనే చచ్చిపోయింది శారద.

కన్నీరు మున్నీరుగ ఏడ్చింది ఇందిర.

సుందరికి శారద ఎవరో తెలియకపోయినా తనువచ్చి రోజునే ఈ దారుణసంఘటన జర గటంతో మనసంతా బాగా కలతపడి పోయింది. ఇందిరను ఓదార్చాలో, సుందరి తన్ను ఓదార్చుకోవాలో అర్థంకాక బాధ పడింది—

ఇంటికివచ్చి రామచంద్రయ్యతో— 'మీరీ వేళ వెళ్తారా బాబాయ్‌గారూ?' అని అడి గితే పేలవంగా నవ్వేశాడు—

'చూడు తల్లీ—బయలుదేరాలని లేక పోయినా నీ మాట కొట్టివేయ లేక కది లాను. కదలగనే దారుణ దృశ్యం చూశాను. రెండు చావులూ చూశాను ఇంత జరిగాక ఇంకా మంచి జరుగుతుందనే ఆశ నాలో చచ్చిపోయింది తల్లీ— ఇక నేను వెళ్ళను, జరిగేనేదో జరుగుతుంది—'

సుందరి ఏమీ అనలేకపోయింది.

ఇందిరకు ఆడపిల్ల పుట్టి, ఆ పిల్ల నెలరోజులు నిండేదాక ఉండి వెళ్ళింది సుందరి.

బారసాలరోజున ఆ ఆడపిల్లకు ఇందిర 'శారద' అని నామకరణంచేయ్యటం విని ఆశ్చర్యపోవటం మినహా ఇంకేమి చేయలేక పోయింది సుందరి.

* * *

చివరిదాకా చదవలేక ఆపేసింది శారద.

—ఎన్నెన్నో ప్రశ్నలు!!

అసలు ఇదంతా ఏమిటి??

అమ్మ జీవితం కాదుగదా?—ఉలికిపడింది శారద.

అయిఉండచ్చు. అయి ఉండచ్చు కాదు, అవును—

తనకు తనెవరి కూతురో తెలిసి. తన తండ్రి తను పుట్టకముసే విదేశాలకు చదువుకోసం వెళ్ళాడుట. చదువనేది ఎంత కాలం? విద్యకు అంతం లేదు నిజమే! కానీ చివరి—కా, అంటే జీవితం అంతమయ్యే దాకా చదవటమనేది నాన్సెన్స్— అంటే...?

## గాజెర హల్వా

కావలసినవి:

| | | |
|---|---|---|
| గాజెరగడ్డలు(కేరట్స్) | 1000 | గ్రాములు. |
| పంచదార— | 750 | గ్రాములు. |
| నెయ్యి— | 500 | గ్రాములు. |
| పాలు— | 300 | గ్రాములు. |
| జీడిపప్పు— | 30 | గ్రాములు. |
| సారపప్పు— | 20 | గ్రాములు. |
| కిస్‌మిస్— | 20 | గ్రాములు. |
| ఏలకులు— | 10 | గ్రాములు. |

తయారు చేయు పద్ధతి:—

గాజెరగడ్డల్ని బాగా శుభ్రమయ్యే విధంగా కడిగి కొబ్బరి 'కోరి'నట్టుగా 'కోరి' (తురిమి) పెట్టుకోవాలి. పాలను పొయ్యి మీద పెట్టి వేడయిం తర్వాత తురిమిన 'గాజెర' నంతా వేసి దగ్గిర పడేవరకూ చూసి అప్పుడు నెయ్యి, పంచదార వేసి బాగా కలియగలపాలి బాగా ఉడికిన తర్వాత ఏలకుల పొడివేసి దింపి 'ప్లేట్'లో వేసి కిస్‌మిస్, సారపప్పు, బాదం పప్పు అద్దితే బాగుంటుంది. చల్లారినతర్వాత తింటే 'గాజెర హల్వా' చాలా బాగుంటుంది.

రుచికరమైన 'గాజెర హల్వా' వేడివలన వచ్చే 'దగ్గుల్ని' తగిస్తుంది. పైత్యము, వాతము, కఫములను దూరం చేస్తుంది. పొట్ట, రొమ్ముల నొప్పులను పోగొట్టుతుంది. మూత్రపు సంచిలోనూ 'కిడ్నీస్'లలోనూ పుట్టే రాళ్ళను తీసివేస్తుంది. వీర్యాన్ని పుట్టించి పుంసత్వాన్ని వృద్ధిపరచే 'గాజెర హల్వా' త్వరగా జీర్ణమై మంచి రక్తమును ఎక్కువగా తయారు చేస్తుంది.

—శ్రీ రామలక్ష్మి నారాయణమూర్తి.

—విదేశాల్లో జీవితాంతం చదువనేది అర్థంకాదు.

అసలు చదువని విదేశాల్లో ఉంటే? — పోనీ, చదవటానికి విదేశాలే వెళ్లి ఉంటే, తిరిగి రావటమో?— నో, నో— ఇదంతా ఊహిస్తున్నదే—

నిజం వేరు—

ఆ నిజం ఇప్పుడర్థమౌతోనే ఉంది— అమ్మ చేసింది పొరబాటు.

ఇచ్చితంగా చెప్పాలంటే కాలు జారింది. అలా అనకూడదు, అమ్మగనుక. అదే మరో స్త్రీ అయి ఉంటే, స్పష్టంగ చెప్పుకోవచ్చు. కాని ఇక్కడో అమ్మ!

కానీ—

అమ్మకి ఇప్పటికి దాదాపు నలభై ఏళ్లుంటాయ్. ఇరవై ఏళ్లకిందటి అమ్మ కింతటి స్వాతంత్రం, స్వేచ్ఛ ... అయి ఉండదు. అపుడెపుడో జరిగినవాటికి అమ్మ రంగులుపూసి రాసిన గాథ ఇది. అందుకే జీవితం అంది!

— ఔను, ఇదంతా అమ్మ జీవితం!!

క్షణంసేపు ఆవేశంలో ఓపలాడి జీవితానికి సరిపడ్డ విషాదాన్ని కొని తెచ్చుకొంది అమ్మ.—'అమ్మా, ఇదంతా నీ తప్పు కాదమ్మా—' అంటే — 'తప్పు ఏలా ఉన్నా తప్పే!—' అనేది అమ్మ.

మరిన్నాళ్లూ తనతో ఈ సంగతి ఎందుకు చెప్పకపోయింది? — అంతా కథలాగే ఉంది. ఎన్నో అడగాలని ఉంది. అడగలేకపోయింది. మౌనంగానూ ఉండలేపోయింది. అదో స్థితి.

'—ఇంత కష్టపడి పెంచిన అమ్మను అమ్మా' అనాలంటే గర్వంగ ఉంది శారదకు. మౌనంగ, మునిపత్నిలాగ గడిపే అమ్మ వెనుక, ఆ తల్లి మనసులో పిండిన మమతానురాగాల వెనుక ఇంతటి అగ్నిపర్వతాలు ఉన్నాయని అయినా ఊహించుకోలేకపోయింది శారద.

మౌనంగ ఉండిపోయింది శారద.

కూతురు మౌనం ఏవిధంగ అర్థం చేసుకోవాలో తల్లి — ఇందిరకూ అర్థం కాలేదు. కాని కానున్నది కాక మానదని మొండిగనే ఉండిపోయింది ఇందిర,

తెల్లగ తెల్లవారిపోయింది,

రోజూకన్న ముందు లేచింది శారద. తల్లి చూస్తుండగనే ముఖం కడుక్కొని తలంటుకొని, తనకెంతో ఇష్టమైన నీలం రంగు, మామిడిపిందెల అంచుపట్టు చీర కట్టుకొంది. తల్లిదగ్గరగ చేరింది. మెల్లగ వంగి తల్లి పాదాలకు నమస్కరించింది.

ఇందిర కేమని దీవించాలో పాలుపోలేదు. తను చెప్పిన 'జీవితం'లోని స్త్రీని కూతురు తెలుసుకొందో, ఆ కథను కాలక్షేపానికే వింటో అర్థం గాలేదు. మనసు అడగమని అంటున్నా బలవంతాన మౌనం వహించింది.

శారద వెళ్లిపోయింది. ఎన్నికలలో ప్రచారానికే అనుకొంది ఇందిర. అరగంటైనా కాలేదు. శారద తిరిగి రానే వచ్చింది.

'అమ్మా, సాయంత్రం ఇంటికి చాల మంది రావచ్చునే!—'

ఇందిర నెమ్మదిగ అంది — 'రానీ!—'

'రానీ అని నెమ్మదిగా అనేస్తే సరిపోదు, స్వీటు, హాటు కావాలి. తప్పకుండా!'

ఇందిర చేస్తానని తల ఊపగనే శారద వెళ్లిపోయింది.

ఈ ఎన్నికలు మంచికే వచ్చాయో, చెడ్డకే వచ్చాయో అని దీర్ఘంగ నిట్టూర్చుకొంది ఇందిర. శారద వస్తేసరికి నింగి చుక్కలు క్రిందికి దిగుతున్నాయి.

'అమ్మా - అమ్మా!—'

శారదకోసం బయటకొచ్చింది ఇందిర, ఎందరినో తెస్తుందనుకొన్న శారద తెచ్చిందొకరినే!—

'అమ్మా ఈయన పేరు మురళీమోహన్. మేమిద్దరం ఇల్లుండే పెళ్లి చేసుకుంటున్నాం. మమ్మల్ని దీవించు—' అంది క్లుప్తంగ శారద.

తన కథ చదివి ఇంత చేస్తుందని అనుకోలేదు. అలాగని ఊరికే ఉండలేదు ఇందిర.

తన కాళ్లకు నమస్కరిస్తున్న ఆ దంపతులనెలా దీవించాలో ఆలోచిస్తోంది ఇందిర.

ఆలోచిస్తున్న ఇందిర కళ్లకు దూరంగ ఎక్కడో ఆకాశం నేలకేసి వంగుతున్నట్లు కనిపించింది. ఆకాశంనిండా లెక్కలేనన్ని నక్షత్రాలు అప్పుడే తలమెత్తి ప్రకాశిస్తున్నాయి.

ఔను, అవన్నీ ఆకాశ దీపాలు!!

**(అయిపోయింది)** ●

**అంకితం:**

చిన్నన్నయ్య—వెంకటరామారావుకు, చిన్నవదినె—వెంకటరత్నం—కు, ప్రేమతో, కృతజ్ఞతతో — రచయిత.



# తెలుగు మాటల తీరుతెన్నులు

## —చల్లా రాధాకృష్ణశర్మ

తెలుగువారి నిత్య వ్యవహారంలో కూడా సంస్కృత శబ్దాలు ఎన్నో దొరలుతూ వుంటాయని చాలామంది అభిప్రాయం. మనం సంస్కృతాన్ని కొంచెం ఎక్కువ మోతాదులోనే వాడుతూ వుండడం నిజమే. అయితే సంస్కృత శబ్దాలను ఆ భాష లోని అర్థాలతోనే మనం వాడుతున్నామా? అని పరిశీలించడం అవసరం. అప్పుడు మనం వాడుతున్నవన్నీ సంస్కృత శబ్దాలు కావేమో అనే సందేహం కలగవచ్చు.

ప్రతి భారతీయ భాషమీద సంస్కృత ప్రభావం కొద్దిగానో గొప్పగానో కనిపిస్తూనే వుంటుంది. ముఖ్యంగా శబ్దజాలం విషయంలో ఈ అంశం కొట్టవచ్చినట్టు కనిపిస్తుంది. కాని ఏ కారణాలవల్లనో, సంస్కృత శబ్దాలు విభిన్న భాషలలో విభిన్న అర్థాలు సంతరించుకున్నాయి. ఒక ఉదాహరణ. అవసరం అనే మాట తెలుగు, తమిళం మొదలైన దక్షిణాది భాషలలో తరచుగా వాడబడుతోంది. అవసర మన్నప్పుడు తెలుగువారమైన మనకు తటుక్కున స్ఫురించే అర్థం తొందర. మరికొన్ని అర్థాలుకూడా లేకపోలేదు. 'నాకిది అనవసరం' అన్నప్పుడు అక్కరలేదు అనే అర్థంతో అవసరాన్ని వాడుతున్నాము. నాకిది ముఖ్యంగా కావాలి — అనడానికి 'ఇది నాకు చాలా అవసరం' అంటున్నాము. అలాగే నిత్యావసర వస్తువులు (తప్పకుండా కావలసినవి), అనవసర విషయాలు (అప్రధానమైనవి లేక పనికిమాలినవి) అని యిలా అవసరాన్ని వాడుతూ వున్నాం. కాగా అవసరానికి అక్కర, తొందర అనే రూఢ్యర్థాలు ఏర్పడ్డాయి. ఈ అర్థాలతో సంస్కృత భాషాభిజ్ఞులు అవసరాన్ని ఉపయోగించరు. సమయం అనే అర్థంలో వాడతారు. మన ప్రాచీనులుకూడా ఈ అర్థంలోనే (తదవసరంబున) అవసర శబ్దాన్ని ఉపయోగించారు. విచిత్రమేమంటే, దక్షిణాది భాషలలో, చివరకి తమిళంలోనూ, అసలు అర్థం మరుగున పడిపోయి తొందర అనే కొత్త అర్థం వ్యాప్తిలోకి వచ్చింది. అవసరంవలె, వికారం (మార్పు), అనుమానం (ఊహ) మొదలైన పెక్కు సంస్కృత శబ్దాలకు వాడుక తెలుగులో కొత్త అర్థాలు ఏర్పడ్డాయి.

ఇంగ్లీషులోని ఫైనాన్స్ మినిస్టర తెలుగులో ఆర్థిక మంత్రి, మలయాళంలో దనకార్య మంత్రి; తమిళంలో నిది మన్దిరి అయినాడు. తెలుగువారి ఆహార మంత్రి మలయాళీల వ్యవహారంలో భక్ష్య మంత్రి. హిందీవారి ఉపన్యాస్ తెలుగులో నవల కాగా, అదే కన్నడంలో కాదంబరి అయింది. కన్నడంవారి ప్రబంధం తెలుగువారి దృష్టిలో వ్యాసం. తెలుగువారు అద్భుతం లేక బ్రహ్మాండంగా వుంది అంటే తమిళులు ప్రమాదం అంటారు. తెలుగులో ఆగ్రహం అంటే కోపం, కాని మలయాళంలో ఆశ అని అర్థం. తమిళంలో ఆశై అంటే అభిమానం లేక ఇష్టం.

ఇంతకూ చెప్పవచ్చిందేమిటంటే, ప్రతి భాషా సంస్కృతంనుంచి శబ్దాలు గ్రహించి వాటికి కొత్త అర్థాలు కల్పించుకుంది. అందువల్ల అర్థ పరిణామం చెందిన సంస్కృత శబ్దాలను ఆయా భాషలకు చెందిన మాటలుగా గ్రహించడం సమంజసమని నా అభిప్రాయం. శబ్ద స్వరూపం మారకపోయినా, అర్థ పరిణామమునకు మనం ప్రాధాన్యం యివ్వాలి. సజీవ భాషకు రూఢ్యర్థాలు పరమప్రమాణం!




ఈ విషయాన్ని ఒక ఉదాహరణతో వివరించడానికి ప్రయత్నిస్తాను. మన దేశంలో పండుతున్న పత్తి విదేశాలకువెళ్ళి, అక్కడ అది గుడ్డగా తయారై, ఆ కొత్త రూపంతో అది మళ్ళీ మనదేశం చేరుకుంటోంది. దీన్ని మనం విదేశ వస్తువుగా గ్రహిస్తున్నాంగాని, స్వదేశ వస్తువుగా భావించడం లేదు.

భాష కూడా ఇటువంటిదే. తెలుగు తమిళములలో 'డబ్బు'ని కాసు అని వ్యవహరిస్తారు. ఇంగ్లీషువారు కాసుని కాష్ (Cash) చేసుకున్నారు. కాష్ నుంచి కాషియర్ వచ్చింది. దీన్ని మన మిప్పుడు తరుచుగా వాడుతున్నాం. తత్ఫలితంగా



ఖజానాదారు, ఖజాంచీ మొదలైనవి మరుగున పడిపోయినవి. కాషియర్ మాటకు కాను మాతృక అయినా, కాషియర్ ఇంగ్లీషు శబ్దమే కాని తెలుగుమాట కాదుగదా!

మనం వాడుతున్న మరొక మాట రూళ్ళకర్రను పరిశీలిద్దాం. గీతలు వేసేందుకు వాడబడే కర్రను రూళ్ళకర్ర అంటున్నాం. దీనికి మాతృక ఇంగ్లీషులోని రూలర్. రూలు (గీత) రూళ్ళు అని బహువచనం చేసి, గీతలు వేసే కర్రగాబట్టి రూళ్ళకర్ర అని వ్యవహరిస్తున్నాం. ఇలా ఇది తెలుగుమాటగా చెలామణీ అవుతున్నది. సంగ్రహం, సారాంశం అనే అర్థాలుగల ఖు (కు) లాసాను కొందరు క్షేమం అనే అర్థంలో వాడుతున్నారు. అలాగే మరో ఉర్దూమాట ముద్దాయిని నేరస్థుడు అనే అర్థంలో వాడుతున్నాము.

ఇలా ప్రతి భాషా కొత్త మాటలను గ్రహించేటప్పుడు, వాటిని తనవిగా చేసుకునేందుకు ప్రయత్నిస్తుంది. ఆ ప్రయత్నంతో అర్థపరిణామం ఏర్పడవచ్చు; శబ్దస్వరూపంలోనూ మార్పు ఏర్పడవచ్చు.

భాష ప్రవాహం వంటిది కనుకను, శబ్దసిద్ధి వాడుకవల్ల ఏర్పడుతుంది కనుకను మనం రూఢ్యర్థాలకు ప్రాధాన్యం ఇవ్వవలసి వున్నది. ఈ దృష్టితో చూచినట్లయితే, అర్థ పరిణామం చెందిన శబ్దాలు ఆయా భాషలకు చెందిన మాటలుగానే భావించడం సముచితమని మనవి చేస్తున్నాను. ●




# కన్నీటి పొయట్రీ!

వచ్చిపోయిన కవులను పూజించే కంట్రీ
మెచ్చునా ఈనాటి నా పొయట్రీ
కాలం గడిచిన పురస్కారం ఆలస్యంగా
కాంగ్రెస్సులో ప్రవేశించారు రంగా!

ఏకాకిగా మిగిలిన సర్దార్ గౌతులచ్చన్న
ఏమున్నదిక స్వతంత్రపార్టీ మన్నా

భూసంస్కరణల ప్రహసనం పెద్ద బూటకం
మోసంతగా వేషగాళ్ళ నాటకం
ఆంధ్రదేశమంతా పెద్ద కాటకం
అగ్గితెగులు వరిపైరుకు కీటకం

ఢిల్లీకి ముఖ్యమంత్రి ప్రయాణం
పల్లెల్లో నానరాదు సుతారాం!
విత్తన ప్రతి విత్తనమూ గయారాం
పత్తా లేదొక్క మొలక బలేరాం

అసెంబ్లీలో అమాత్యుల వాగ్దానం
ఆచార్య వినోబాభావే భూదానం!
ఎం. యల్. ఏ లిస్తుండే స్టేట్‌మెంట్సు
ఎక్కడా కన్పించవు అసలు పాయింట్స్!

సామ్యవాదం మననేతల ఊతపదం
సరదాగా వాడకొనే నానపదం!
కుంచిపిళ్ళ లారీకై అనుక్షణం
మన జనాల నిరీక్షణం ప్రతిక్షణం
పట్నాల ఆస్తులపై పరిమితి
పత్రికల్లో కొత్త పాటలో శ్రుతి
జిల్లా కొక మంత్రి నేటి ప్రోగ్రాం
టీపార్టీలో జిలేబి ఫలహారం!

ఎం. యల్. ఏ పక్షం పొడుగు ఆకారం
దినదినా నమ్మకు కరువను ప్రచారం!

నా ప్రబంధం చేతగ్గాను కోల్పోయిరు
నాకు లేదు ప్రైడర్ ప్రాగు నిగు
కవిని గాన గమనించరు కన్నీరు
కవిత రూపమెత్తినదీ పన్నీరు

నా దాహం చల్లార్చే నాథుడు లేడు
గోదారిలో దిగుదామని మనసేరాదు
చచ్చిన కవులను పూజించే నా డియర్ కంట్రీ
మెచ్చుకోదనా ఈనాటి నా కన్నీటి పొయట్రీ!

— కె. వర్మ

# చీమబ్రతుకు




ఆర్.యస్.కె.మూర్తి

'ఛీ. ఛీ పాడు బ్రతుకు' — వళ్ళు విరుచుకుంటూ ఆగిపోయింది, వరుసలో వెళ్తున్న చిరుచీమ.

చీమలు బారులుకట్టి వెళ్తున్నాయి. ఏవో పరుగులు పెడుతున్నాయి... పుట్టి మునిగినట్లు ప్రళయం ముంచుకొస్తున్నట్లు చలికాలం మీదకు దుమికేస్తున్నట్టు తిండి కరువొచ్చి చీమజాతంతా సర్వనాశనం కాబోతున్నట్లు ఏదో హడావిడి! గబగబ గింజలు మోసుకెళ్ళాలి. గూళ్ళను నింపుకోవాలి. వేసవి వెళ్ళకముందే ఎత్తర నిండే వనరులు సమకూర్చుకోవాలి.

చీమలన్నీ గింజలు నోటికంటించుకొని పరుగులు పెడుతున్నాయి— వరుసలలో!

రాయుడు అనే చిరుచీమకు వళ్ళు హూనమైపోతున్నది. ఈ హడావిడి అతగాడికి నచ్చలేదు. ఎంతగా పరుగులు పెట్టే మాత్రం ఏమిటి ప్రయోజనం! ఎప్పటికి నిండేను, ఈ ధాన్యపుగూళ్ళు! నిండి మాత్రం ఏమిటి సుఖం! నింపుకొన్న సొమ్ము నోటికందేలోగానే ఏ కాలి క్రిందో పడి నలిగిపోమని నమ్మకమేమిటి? ప్రతి నాలుగు క్షణాలూ పరుగులు పెట్టటం! ఏదో అందుకోవాలని ఆత్రత చెందటం అందీ అందకనే అడుగు క్రిందపడి ధ్వంసమైపోవటం!

'ఛీ ఛీ. పాడు బ్రతుకు'— అనిపించింది, చిరుచీమ రాయుడికి. వళ్ళు విరుచుకుంటూ నిలిచిపోయింది, వరుసలో వెళ్తున్న రాయుడు చీమ.

వరుసలో ఉరకలు పెట్టుకొస్తున్న మరో చీమ, మరో చీమ రాయుణ్ణి రాచుకుంటూ వెళ్ళిపోయినై. అట్లాగే మరోటి, మరొకటి. చివరన వచ్చిందో చిన్నారి చీమ. అదే మిసెసు రాయుడు. మిసెసు రోజీ రాయుడికి తన రాయుడిట్లా వళ్ళు విరుచుకుంటూ కూర్చోటం ఆశ్చర్యం కలిగించింది.

'ఏంటయ్యా, అలా కూలబడ్డావు?' అని అడిగింది, చీమ భాషలో.

'ఆ, పోదూ, వెధవ బ్రతుకు! విసుగు పుడుతున్నది' — అంటూ మరోసారి వళ్ళు విరుచుకుంది, రాయుడు చీమ.

'సంబడమే. వేదాంతం చెప్తున్నావే. అప్పుడే. ఇంకా గూట్లో సగమైనా నిండలేదు. రేపో, నేడో నేను మరిన్ని గుడ్లు పెట్టబోతున్నాను. వచ్చేదేమో చ(క)లి కాలం. ఇప్పుడిలా కూలబడిపోతే, రేపు నలుసుల గతి ఏం కావాలంటావు? లే ... లే—' అని అదిలించింది. సైజులో రాయుడికంటే రెండు చుట్లు ఎక్కువేఉన్న మిసెసు రాయుడు.

'అదికాదే, చీమభామా! మనమెంత కష్టపడి ఏం లాభం చెప్పు. ఆ చలి చీమలు చూడు. ఎంచక్కా రెక్కలతో రివ్వున ఎగిరిపోతున్నయ్యో! వాటి ధాన్యపు గూళ్ళు చూడు, చకచకా ఎలా నిండి పోతున్నయ్యో! మనకీ అలా రెక్కలుంటే...'

'విషాదంలోకి జారిపోయింది; రాయడు చీమ.

ఏనుగంత సమస్యకు తన చీమ బుద్ధితో పరిష్కారమార్గం కనిపెట్టి సింది రాయడు అనే చిరుచీమ.

చలిచీమలా రెక్కలుంటే సర్వ సమస్యలూ దూదిపింజలైపోతయ్యనే నమ్మకం కలిగింది, రాయడు చీమకు.

చిరుచీమకు, తనో చలిచీమను కావాలనే, కోర్కె పుట్టింది!

## ఇది నాందీ ప్రస్తావన!

### ఇదేమో పూర్వరంగం!

'పోదూ, వెధవ బతుకు! ఎంత కష్టపడి ఏమిటి లాభం! ఈ చిట్టి, చిట్టి సంపాదనలతో ఎప్పటికి ఉట్టికెక్కేను?—' అన్నాడు, చిట్టిబాబు.

'అబ్బో, అప్పుడే ము జనమార్గం పట్టేటట్టున్నారే? ఇద్దరు కూతుళ్ళకి పెళ్ళిళ్ళు చెయ్యాలి. ముగ్గురు కొడుకులకు కోడళ్ళను తేవాలి. అప్పుడే కాడి పారేస్తే ఎట్లాగండీ? కాస్త అపాలూ, ప్రెజ్జా సీట్లో ఉండంగానే చలికాలాన్ని గురించి ఆలోచించండి. ముందంతా ఖర్చుకాలమే—' అంది అతని యింటి యిల్లాలు, జాకెట్టు గుండీలు పెట్టుకుంటూ.

ఆవిడో పిచ్చియిల్లాలని, తినటం, సంసారం చెయ్యటం తప్ప మరోటి తెలియని దని ఆవిడ్నిగురించి చిట్టిబాబుకున్న పిచ్చి అభిప్రాయం.

'పోదూ, వెధవ సంపాదన, చీమ సంపాదన! ఎన్ని బల్లల్కింద చేతులు పెట్టి బతుకులు తెల్లవారేను'— అన్నాడు. వళ్ళువిరుచుకుంటూ చిట్టిబాబు

'అబ్బో. వేదాంతం ముదిరే పోయింది!' అ నవ్వుతూ. టీ రెకట్టుకోటానికి లేచింది, మిసెసు చిట్టిబాబు.

'వేదాంతంకాదే, వెర్రిమొహమా! జీవిత సత్యం! ఆ సుబ్బయ్యను చూడు. ఎంచక్కా నాలుగు కాంట్రాక్టులుచేసి. మేడ లేపేసాడ్! ఐదూ, అర్థా కలికి మనమెప్పటికి పైకి వస్తామే, పిచ్చి మాలోకమా!' అంటూ మరోసారి వళ్ళు విరుచుకున్నాడు — గవర్నమెంటు హెడ్క్వార్టర్స్ హాస్పిటలు గుమాస్తా, చిట్టిబాబు!

### ఇదీ పూర్వరంగమే!

ఒకప్పటి చిట్టిబాబు తాను ఉత్త గుమాస్తానని అనుకొనేవాడు కాదు. మెడికల్ డిపార్టుమెంటు ఉద్యోగినని అనుకునేవాడు. ఎందుకనంటే అతను మామూలు గుమాస్తాల కంటె కాస్త ఎక్కువ ఫాయిలోనే జీతాన్ని గడుపుతుంటాడు— అతనుండే సీట్లు పుణ్యమా అని. అంతే కాదు. అతను అప్పుడప్పుడు కథలు గట్టా వ్రాస్తుంటాడు. దాంతో పోషలు లైఫు కూడ అతనికి కాస్త కూస్త ఉన్నదనే చెప్పాలి మామూలు గుమాస్తాలకి అందుబాటులోకి రాని కొన్ని సుఖాలు, కొన్ని అనుభవాలు కూడ అతను అందుబాటులోకి తెచ్చుకోగలిగాడు. ఉదాహరణకతను, ప్రొహిబిషను తీసెయ్యకముందే, బ్రాందీ తాగాడు. హైదరాబాదు హొటల్లో బసచేసిన ఓరాత్రి, అతను ధైర్యంచేసి హోటలు బాయ్ చేత బ్రాందీ తెప్పించుకొని తాగాడు. అయితే బ్రాందీకోసరం తాని ప్రని చేశానని అతననుకోడు, అది తాగిన అనుభవమెలా ఉంటుందో తెలుసుకోటానికే తానాపని చేశాననుకుంటాడు, చిట్టిబాబు. ఇట్లాంటివే అతని జీవితంలో మరికొన్ని అనుభవాలు చెప్పరానివి! చెప్పలేనివి!

మొత్తంమీద జీవితంలో కాస్త, కూస్త అడ్వెంచరు చూసినవాడే, చిట్టిబాబు.

అయితే ఈ మధ్య కొన్నిరోజులుగా అతని మనసు కంగాళీగా ఉంటున్నది. రాత్రిళ్ళు తెల్లవార్లూ స్మశానవిహారాలు చేస్తున్నది, కొరివిదయ్యంలా ఏదో బాధ దాన్ని పీడిస్తున్నది. ఎదురుదెబ్బ తగిలిన కాలివేలినుండి రక్తం కారుతుంటుంది. నొప్పిమాత్రం వెంటనే తెలియదు. రక్తం గడ్డకటి, పగిలిన చర్మం బిరుసెక్కితే తప్ప బాధ బయటకు రాదు. చిట్టిబాబు మనస్సుకి అట్లాంటిదే ఎదురుదెబ్బ తగిలింది.

చీమ బ్రతుకు కాదా, తనది?

ఈ ప్రశ్న చిప్పకున్న మనస్సుకి తగిలి కసిక్కిన గాయమైంది.

బారులు తీరిపోతున్న చీమలను గమనించాడు, చిట్టిబాబు కొన్ని ఆలోచనలు ఆ కథకుడి బుర్రలో గింగిరాలు తిరిగినై. చీమలు గూడను పకడ్బందీగానే కట్టుకుంటై. చచ్చేటట్టు శ్రమపడి గింజల్ని పోగుచేసుకుంటై. కాని, జీవితకాలమంతా కష్టించినా, అవి ఓ గిద్దెడు గింజలు నిల్వ చేసుకోగలవా?

తనదిమాత్రం అంతకంటె ప్రయోజనకరమైన జీవితమా ఏమిటి?— అనిపించింది, చిట్టిబాబుకి.

ఎంతగా బల్లలకింద చేతులుపెడ్తేమాత్రం, ఓ చెక్కపున్నెకం సంపాదించుకోగలడా, తాను?

ఈ ఆలోచనే తని మనస్సుకి ఎదురుదెబ్బలా తగిలింది. అందుకే అతనుకున్నాడు —ఐదూ, అర్థా కలికి ఎప్పటికి పైకి వచ్చేరూ— అని ప్రక్కింటి సుబ్బయ్యలా ఎప్పటికి వేడకట్టేవూ— అని.

ఏనుగంత సమస్య ఎదురైంది. చిట్టిబాబుకు.

తన చిట్టి మనస్సుతో ఇట్టే పరిష్కారం కనిపెట్టేశాడు; అదే...ఓ లాటరీ టిక్కెట్టు కొని పారేశాడు, చిట్టిబాబు. చలిచీములా రెక్కలుంటే చిరుచీమ బ్రతుకు నుంచి తప్పించుకోవచ్చునుకున్నాడు.

### అమ్మయ్య! అసలుకథ కొచ్చాం!

లాటరీలో వచ్చిన డబ్బుతో చిట్టిబాబు సమస్యలన్నీ పరిష్కారమై ఉంటే అతని కథ చెప్పుకోవలసిన అవసరమే ఉండేదికాదు —కాపీరైటు చట్టాన్నికూడా ధిక్కరించి.

ధిక్కరించటమేమిటంటే, తన యీ లాటరీకథ ఏ రూపంలోను యితరులు వాడుకోవటం యిష్టంలేదు, చిట్టిబాబుకి. లాటరీలో తనకు వచ్చినడబ్బు తనకు మరిన్ని సమస్యలను తెచ్చిపెడుతుందని ఊహించలేదు, అతను. చలిచీములా ఎగరటంలో, ఉన్నకాళ్ళను చేస్తున్న కండలను పోగొట్టుకోవలసి వస్తుందని అనుకోలేదు అతను.

లాటరీలో డబ్బు వచ్చింది; చిట్టిబాబుకి అందులో సందేహం లేదు.

తనకు లాటరీలో డబ్బు వస్తుందని విశ్వసించటంలో కూడ పొరపాటేమీ చెయ్యలేదు చిట్టిబాబు. ఈడబ్బు రావటానికి సరిగ్గా రెండునెలలా పదమూడు రోజుల నాడు అతను మొదటిసారిగా లాటరీ టికెట్టు కొన్నాడు." అప్పుడది హర్యానా లాటరీ. ప్రైజు లక్ష రూపాయలు. ఆలక్ష రూపాయలు తనకే వస్తయ్యని నమ్మటంలో లోపమేమీ చెయ్యలేదు, చిట్టిబాబు. ఆ లక్ష ఎట్లా ఖర్చుచెయ్యాలో కూడ అతను

తగినంత పకడ్బందీగానే ఆలోచన చేసి పెట్టుకున్నాడు. పటిష్ఠంగా తన కార్యక్రమాలను గురించి చక్కటి రూపకల్పనే చేసుకున్నాడు, చిట్టిబాబు.

తనకొచ్చిన డబ్బుతో ముందో చక్కటి మేడ కట్టుకోవాలి. చిట్టిబాబుకు పిత్రార్జితమైన యిల్లొకటే ఉంది. అది రెండుగదుల డాబా యిల్లు. డాబా పాతబడి పోయింది. స్థలం మాత్రం లంకంత. ఆ డాబానే మార్చెయ్యాలి. పైఅంతస్తు వేయించాలి, హాలులోనుంచి— సినిమా సెట్సులోలగ— పైకి మెట్లు కట్టించుకోవాలి. కాని తన డాబా యింటిహాలు చిన్నది కదా? అక్కడి నుంచి మెట్లు అవీ కుదిరేటట్లు లేదు. పోనీ యిల్లంతా పడగొట్టించి కొత్తది వేయిస్తే?

అందుకు చిట్టిబాబు మనసొప్పలేదు. అతనికి సెంటిమెంటు ఎక్కువ. తాతముత్తాతల కాలనుంచీ వస్తున్న యింటిని పడగొట్టించటమంటే అతనికి మనస్సు చివుక్కుమన్నది. వచ్చిన లక్షరూపాయలను తనకున్న సుఖాలకు కలుపుకోవాలనుకున్నాడే తప్ప, ఉన్నదాన్ని నాశనం చేసుకొని కొత్తది నిర్మించుకోవాలని అనుకోలేదు, చిట్టిబాబు. జీవితంలో కాస్తో, కూస్తో సుఖాలను రుచిచూచినవాడే కదా అతను!

సీతాపతి చిట్టిబాబుకో క్లర్కు. అతనికి సీతాపతి అని పేరు పెట్టినందుకు వాళ్ళ నాన్నకు అంతమాన్ను వేశారు. అతనికీ, ఏకపత్నీవ్రతానికి అంతటి దూరం, అతనుండేది నర్సుల లీవులు, జీతాలు చూచే సీటు. అక్కడ అతనికి లభించిన పరపతి అంతా అతను పరసతి సంపాదనకొరకే వినియోగిస్తూ ఉంటాడు. సీతాపతి అన్నాడు వోసారి!

'ఒరేయ్, చిట్టీ నీకా లక్ష రాంగానే వింటక్కా మన కాజుయార్టీవార్ను సింగారి లేదూ? దాన్ని తీసుకొని మద్రాసు చెక్కేయి. సింగారి హీరోయినుగా వో బ్రహ్మాండమైన సినిమా తీసెయ్యి.'

ఈమాట విన్న చిట్టిబాబుకి ఒళ్ళంతా తేళ్ళు, జెర్రులు పాకినట్లయింది. పళ్ళెత్తు పద్మప్రియ తనను చూచి నవ్వినప్పుడు ఫీలయ్యేటట్లు ఫీలయ్యాడు. చెప్పలేని అనుభవాలు కొన్ని చిట్టిబాబుకి ఉన్నయ్యన్నాం కదా? వాటిల్లో ఒకటి ఈ పద్మప్రియ. ఇతన్ని చూసినప్పుడల్లా నవ్వుతుంటుంది. దాంతో అతనికి ఎప్పుడో, ఎక్కడో పడ్డ తాన్యతయం గుర్తుకొచ్చి ఒళ్ళంతా జెర్రులు పాకినట్లవుతుంది. సీతాపతి అన్నమాటలకు అతనికి అలానే చిరాకు పుట్టింది. చిట్టిబాబు భార్య పిచ్చియిల్లాలు. తన ఐదుగురు పిల్లలకు ఆమె తల్లి. ఆమె ను కాదని అనుకోవటం — లక్షాధికారి ఐతే మాత్రం — తనకు సబబేనా?

కాకపోతే లక్షాధికారిగా తాను తన భార్యదగ్గర కొంతపోజా వెలగపెడ్తాడు తానుమాత్రం పైగదిలోనే ఉంటాడు. పిలిస్తే రాలూ అవీ అక్కడికే తెస్తుంటుంది భార్య. రాత్రికికూడ పిల్లలందరూ క్రింది గదులలో నిద్రపోయిన తర్వాత పైకి వస్తుంది.

అప్పటికి తనకు సరదాగా ఉంటే ఆమెతో కొంత కాలక్షేపం చేస్తాడు. లేదూ అంటే పక్క బెడ్డుమీద పడుకొని నిద్రపోతుంది అంతే

సీతాపతిగాడ్ని పాతెయ్యాలి. వెధవ మాటలు పీడానూ. అది సరే సింగారి, రంగేళి గొడవలు లేకపోయినా, మేడ ఉండాలి కదా? దానికే ప్లాను కుదరటంలేదు. పోనీ యిల్లంతా మార్పించి, కొత్తది కట్టిస్తే ఓ అరవై, డెబ్బయివేలు యింటికే ఖర్చవుతుంది. మరి మేడఉన్న తర్వాత కారు ఉండకపోతే ఏం బాగుంటుంది?

కారు కొనాలనే నిర్ణయం చిట్టిబాబు ఏనాడో చేసుకున్నాడు. వాళ్ళ యింటిముందు ప్రహరీగోడలో ద్వారం ఓ పెద్ద గేటు ఉండేది— మేడ్ ఆఫ్ బాంబూస్! వాళ్ళ తాతగారు దాన్ని అలా ఉంచారు. ఆయనకు వ్యవసాయం చేయించాలని సరదాగా ఉండేది సొంత వ్యవసాయం సొంత ఎడ్లు. బండి సరాసరి దొడ్లోకి వెళ్ళటానికి ఆయనా వసాలగేటు వదిలి పెట్టించారు. ఆయనకు కాస్త కవిత్వంలో పరిచయముండేది. వాళ్ళ ఊరికి కలెక్టరు దొర వచ్చినప్పుడు ఈయన నవరత్నాలు చదివారు. దొరకి తెలుగురాదు. కవిగారికి యింగ్లీషు రాదు. మధ్య దుబాసీగా పనిచేసి నాయన దొరగారు ఆ పద్యాలను మెచ్చుకొన్నారని చెప్పారు. కవిగారు సంతోషించి, వెండి పొన్నువేసిన తన నస్యం డబ్బిని దుబాసీకి బహుమానమిచ్చేశారు. ఆ దుబాసీ ఎవరో కాదు చాలకాలంగా ఆ నశ్యం డబ్బిమీద కన్నేసి ఉన్న వాళ్ళ ద్వారి వీధి అరుగు బడిపంతులే కదా? అయినా కవిగారికి తన కవిత్వానికి రాజాదరణ లభిస్తుందని, నానారాజసందర్శనంచేసి అగ్రహారాలు సంపాదించి, స్వంత వ్యవసాయం చెయ్యాలని మోజుగా ఉండేది. ఆ హోదాకి పూర్వరంగంగానే ఆయన గేటు పెట్టించాడు. కోర్కెమాత్రం తీరకుండానే ముసలి కవి నిర్యాణం చెందింది!

కవిగారి కుమారుడు, చిట్టిబాబు తండ్రియైన గోపాలం ఉద్దండ మొద్దు



బ్బాయిగా ఆయనకి పెద్ద హోదాహోడి ఉండేది కాదు. అందుకే ఆయన గేటు తీయించేసి, గోడ కట్టించేశాడు. చిట్టిబాబుకి దాన్ని మళ్ళా గేటుగా మార్చి, కార్ను తోలించాలని సరదా! కాబట్టి కారు కొనక తప్పదు. కారు ఖరీదెంతలేదన్నా ఓ ఇరవైవేలు అవుతుందిట! అదీ ఏలాటు మెంటులో వస్తే, లేకపోతే యింకో పది వేలన్నా పెట్టాలి. ఏలాటుమెంటు ఎప్పటికి వచ్చేదో, ఏమో? కాబట్టి ముప్ఫయి వేలు ఖర్చుపెట్టక తప్పదు.

వచ్చిన లక్షా మేడకీ, కారుకే సరిపోతే, తర్వాత? మళ్ళా మామూలు గుమాస్తా ఉద్యోగం చెయ్యాలా? ఛీ. ఛీ. అనిపించింది, చిట్టిబాబుకి. అదికాదు. ముందీ డబ్బుని పెంచాలి. ఎట్లా? వ్యాపారమేదన్నా చేస్తే?

వ్యాపారం చెయ్యాలంటే చాలరకాలున్నయ్యనుకోండి, కాని వాటి కన్నింటికి లైసెన్సులు, పర్మిట్లు కావాలికదా? చిట్టిబాబు స్నేహితుడొకడు తనవాటా కొచ్చిన రెండువేలతో హాస్పటలుముందు బంకు పెడదామనుకున్నాడు. దానికి అవసరమైన లైసెన్సులన్నీ సంపాదించేటప్పటికి ఆ రెండువేలు ఖర్చయిపోయి, ఆయ్యవాడు మిగిలాడు. ఇప్పుడతను ఆస్పత్రి చెట్లనీడలలో, అనేకమంది నర్సులకు పర్సనలు అసిస్టెంటుగా పనిచేస్తున్నాడు.

లైసెన్సు సంపాదించేటప్పటికే తన డబ్బు హాళక్కి అయిపోతుందేమోనని భయమేసింది, చిట్టిబాబుకి: అదీగాక, ఈ టాక్సు గొడవ ఒకటిలేదూ? లాటరీ డబ్బుకంటె టాక్సులేదు. కాని ప్రభుత్వం కళ్ళన్నీ ఆ డబ్బుమీదనే ఉంటై. దాంట్లో రూపాయి ఖర్చుపెట్టి. ఇంకోరూపాయి సంపాదిస్తే, అదీ, యిదీ కలిపి దోచేస్తుంది, టాక్సుల ప్రభుత్వం. పాపం, సినిమా స్టార్లు అందుకేగదా, వాళ్ళడబ్బుని బాత్ రూం గోడల్లో దాచుకోవటం? ఎట్లా గబ్బా? మేడ, కారు హోదా నిలుపుకోవాలంటే వ్యాపారం చెయ్యాలి. చెయ్యాలంటే లైసెన్సులు! టాక్సులు! గోల!

ఇండియా దటీజ్ భారత్ ప్రభుత్వం వారి లైసెన్సింగు విధానపు చిక్కుముడి విప్పి, సదరు ప్రభుత్వంవారి పన్నుల గొడుగుకి చిల్లులు పొడిచి, డబ్బును పెంచి, మేడా కారూ హోదా నిలుపుకోవట మెట్లాగా అని చిట్టిబాబు మధనపడుతుండగానే—ఆ లాటరీ ఫలితాలు వచ్చేసినై.

అమ్మయ్య! తనకు ప్రైజు రాలేదు.

* * *

పీడా పోయిందిలే — అనుకున్నాడు, చిట్టిబాబు. చాలీచాలని ఆ లక్షా రాకుండా ఉండటమే మంచిది.

చిట్టిబాబుకి జ్యోతిషంలో నమ్మకముంది. ప్రస్తుతం అతనికి గురువు మహర్దశలో ఉన్నాడు. ఈ పీరియడులో అతనికి ఉద్దరగా డబ్బు వచ్చి పడుతుందని జోస్యులు బల్లగుద్ది మరీ చెప్పారు. అసలు చిట్టిబాబుకే ఆ నమ్మకమున్నది. కాబట్టి ఏ కాస్త వచ్చి, జోస్యం నిజమై, మాక్బెత్ లాగా, తనకు చిక్కులు ఎక్కువ చేసేకంటె, ఆ చిన్నమొత్తం రాకుండా ఉండటమే మంచిదికదా?

రాజస్థాన్ లాటరీ ఇరవై ఒక్కలక్షలుకి ఎంచక్కా ఆ ప్రైజు తీసుకుంటే, హాయిగా తనకోర్కెలన్నీ తీర్చుకోవచ్చు ననుకున్నాడు చిట్టిబాబు.

టికెట్టు కొన్నాడు, చిట్టిబాబు.

